# లంచాల పిశాచం

## రెండంకముల

## నాటకము

రచయిత

శ్రీ పన్నాల రామశేషగిరిశాస్త్రి

1951

 0-12-0

# నమస్తే

నాటకరచనలో నాకనుభవము లేకపోయినప్పటికీ నా మిత్రుల ప్రోత్సాహము చేత ఈనాటకమును వ్రాసితిని. ఇది కేవలము కల్పితనాటకము. ఇందులో కొన్ని అతిశయోక్తులున్ననూ, కథ సాఫీగా నడుచుటకు ఆ అతిశయోక్తులనంతగా పాటింపరాదను విషయమును మీరంగీకరింతురని నా ఆశ. నేను కవినిగాని, పండితుడను గాని, కాకపోవుటచే, ఇందనేక విధములైన దోషములుండవచ్చును. సరసజ్ఞులు క్షమింతురు గాక. ఈనాటకమును వ్రాయుటకు శ్రీ అన్నంభొట్ల సూర్యనారాయణమూర్తిగారి సంపాదకత్వమున వెలువడిన వినోదినీ గ్రంథమాల - కాకినాడ వారి ప్రచురణలలో శ్రీ మంచికంటి రాజారావుగారి 'లంచాల పిశాచం' అను హాస్య రచన నాదర్శముగా తీసుకొంటిని. మార్గదర్శకులైన శ్రీ మంచికంటి రాజారావుగారిని నేనెన్నటికీ మరువలేను. నా ప్రార్థనపైన యీ నాటకమునకు పద్యములు (అంకితముతో గూడా అయిదారు పద్యములుతప్ప) వ్రాసియిచ్చినందులకు హైస్కూలు ఆంధ్రోపాధ్యాయులైన ఉభయభాషాప్రవీణ, శ్రీ ముక్కామల రాఘవయ్యగారి కెంతయూ కృతజ్ఞుడను. ఇందలి 'చేతిపనులెగా' అనుకీర్తన శ్రీ యడ్లపల్లి కోటయ్యగారు రచించిన 'గాంధేయ విజయము' అను నాటకములో నున్న 'చేతిపనులె భారతభువి జీవితపంథా' అను కీర్తన ననుకరించి వ్రాసితిని. ఆదర్శ కవితావిశారదులైన శ్రీ యడ్లపల్లి కోటయ్యగారికి నా అభినందనములు.

ఇట్లు

గ్రంథకర్త

# అంకితము

తే. గీ.– శ్రీరమించెడి ప్రకట నల్లూరు వంశ
భవుడు వేంకటకృష్ణయ భవ్యమతికి
సతి సుగుణశీల పిచ్చమ సాధ్వి గర్భ
మునను జనియించితి వార్య జనము బొగడ.

తే. గీ.– వేంకటాచల స్థైర్యము వినయ ధాము
రాము శాంతము నీయందు రాజిలంగ
ఔర! వేంకట రామయ్య యనెడు పేరు
సార్థకమ్మయ్యెహో! నీకు సహజముగను.

ఆ. వె.– నైజవితరణగుణ నల్లూరు వేంకట
రామయాఖ్య! నీకు మామక కృతి
నంకితముగ నిడితి నాశీస్సులతో గూడ
దిశల నీ యశస్సు తేజరిల్ల.



## కృతిభర్త

శ్రీ నల్లూరు వెంకట్రామయ్యగారు

(పంచాయితీబోర్డు ప్రెసిడెంటు, కోపల్లె, తెనాలి తాలూకా)

**ఈ గ్రంథమును అచ్చువేయించిన దాతలు**

పరమేశ్వరుడు వీరికి పుత్ర పౌత్రాయు రారోగ్యైశ్వర్యాదుల

ప్రసాదించుగాక.

## ఈ నాటకమునకు కావలసిన వస్తువులు

కరపత్రాలు, కార్డు, ఖాతాపుస్తకాలు, దస్తావేజుల ఫైలు, పడిచిన్న కాగితాలు, చాప, చిన్నమంచం, రెండు కుర్చీలు, డ్రాయరు, టికెట్లు అమ్మేమాదిరిగా చిన్న బీరువా. గాల్నం, ముక్కాలిపీట. లేసుముక్క, అల్లేసూది, దారం. మామూలుకర్ర. కొంకికర్ర. అగ్గిపెట్టె, సిగరెట్ పెట్టె, పొగాకు కాడ, పొగాకుచుట్ట. కొడవలి, చేతిగొడ్డలి, స్టెతస్కోపు, ఇంజక్షన్ సిరంజి, మందుసీసా, మంగళసూత్రం, పసుపుకొమ్ము, చిన్నపూల బుట్ట, అన్నంగిన్నె, పేలపిండి, గోగునార, ఫౌంటెన్ పెన్, కళ్ళ జోడు, విజిల్.

వ.రా:- ఈనాటకమునకు మూడు తెరలు ఉండవలెను.

## ప్రకటన

ఈనాటకముయొక్క హక్కులన్నీ నాకేచెంది యున్నవి గాన నాయొక్క లిఖితపూర్వకమైన అనుమతిలేనిదే ప్రదర్శించుట, పాడుట, అచ్చొత్తించుట, అమ్ముట, వగైరాలు ఏమినీ చేయకూడదు. దీనిని అతిక్రమించినవారు నాచేకోర బడు నష్టపరిహారమునకునూ, నాచేజరుపబడు సివిల్, క్రిమినల్ చర్యలకునూ, ఖర్చులతో సహా బాధ్యులగుదురని ఇందు మూలముగా హెచ్చరించటమైనది.

ఇట్లు

వన్నాల రామశేషగిరిశాస్త్రి

గుడివాడ (పోస్టు)

వయా తెనాలి

# ఇందువచ్చుపాత్రలు

## పురుషులు

1. గోపయ్య — ఒక రైతు
2. వేణు — గోపయ్యకొడుకు
3. వీరన్న — గోపయ్య యింటిప్రక్క వాడు
4. అప్పడు — గోపయ్య జీతగాడు
5. బిళ్ళ బంట్రోతు
6. అగ్రికల్చరల్ డిమాన్ స్ట్రేటరు
7. టోపాదు గుమాస్తా
8. మైల్ జవాన్
9. సబ్ డివిజనల్ ఆఫీసర్
10. షావుకారు పుల్లయ్య
11. డాక్టర్
12. ప్రైవేట్లు బాపిరాజు
13. బుకింగ్ క్లర్కు
14. పోలీస్

## స్త్రీలు

15. దుర్గమ్మ — గోపయ్య భార్య
16. కమల — గోపయ్య కూతురు

ఇంకా కొంతమంది వాలంటీర్లు వత్తురు.

శ్రీ రామ

# లంచాలపిశాచం

## ప్రథమాంకము

### 1 వ రంగము

(లంచగొండి తన నిర్మూలనోద్యమవాలంటీర్లు అయిదుగురు నినాదాలు చేసుకొంటూ వస్తారు. చివరి వాలంటీరు కరపత్రాలు పంచిపెడుతూ వుంటాడు. అందరికీ ఖాదీస్కౌట్ డ్రెస్ వుంటుంది. వీళ్ళు వెళ్ళేలోపల వేణు వచ్చి ఒక కరపత్రాన్ని తీసుకు వెళ్తాడు.)

(మొదటి వాలంటీరు అనేది) — (మిగతా నలుగురు వాలంటీర్లు అనేవి)

నినాదాలు:- 1 లంచాలపిశాచాన్ని — నిర్మూలించాలి
2 తక్కిసాలివ్వటం — తగ్గించాలి
3 మామూళ్ళివ్వటం — మానెయ్యాలి
4 కట్నాలుతీసుకోటం — కట్టిపెట్టాలి

(నినాదాలు చేసిన వెంటనే అందరూకలసి కీర్తన పాడతారు)

మార్చింగ్ సాంగ్ - మోహన-త్రిశ్రగతి (సమిష్టిగానము)

1. లెమ్మన్న లెమ్మన్న సోదరా
రమ్మన్న ధైర్య మూనరా
లజ్జలేక ప్రజల పీల్చు
లంచాల పిశాచిగూల్చ ! లెమ్మన్న॥

2. శక్తిసాల దయ్యాన్నిక
తరిమి తరిమి కొట్టరా
కొట్టరా పట్టరా
పట్టి పాతిపెట్టరా
మాయమాళ్ళ మహామ్మారిని
మట్టుబెట్ట వేగరార ॥లెమ్ము॥

3. రక్తమంత పిండి ప్రజల
శక్తినంత గూల్చెరా
కూల్చెరా కాల్చెరా
కాల్చికొంప లార్చెరా
కష్టమైన నష్టమైన
మట్టపీడ తొలగగొట్ట ॥లెమ్ము॥

4. అధికారపు లంచగొండి
బధిరాంధుల గాంచరా
గాంచరా మించరా
మించి ప్రతిఘటించరా
అధికారపు బెదరింపుల
కణుమాత్రము వెనుదీయక॥ లెమ్ము॥

(అందరు ఈకీర్తన పాడుతూ వెళ్ళిపోతారు)

(తెర యెత్తగానే)

(గోపయ్యగృహము. ఒకప్రక్క మంచమునిలబెట్టివుంటుంది. వేణు 20ఏళ్ళ లోపు వయస్సు. కాలేజీ స్టూడెంటు. దసరా సెలవలకు యింటికివచ్చాడు. సన్నగా దువ్వుకొని డబల్ కవ్స్ చొక్కా, ట్రౌజరు తొడుక్కొని కుర్చీలో

కూర్చుని వాలంటీర్లు ఇచ్చినకరపత్రం చదువుతూవుంటాడు. తండ్రిగోపయ్య వయస్సు 50. కొద్దిగాచదువుకల్గి లోకజ్ఞానంగలరైతు. మోకాలిపైకి గట్టిన ధోవతి, మోచేతుల పైకి మడిచిన, లాల్చీతో పొలంనుంచి వచ్చి చేతిలో కొడవలిని ఒకమూల పడవేసి ఎగగట్టిన ధోవతిని, లాల్చీని క్రిందకు దించుకొని దులుపుకొంటూ వేణువంక చూసి)

గోప:- ఏమిట్రాలవి! తెగచదువుతున్నావ్! అన్నంతిన్నావా!

వేణు:- లేదునాన్నా! లంచగొండి తననిర్మూలనోద్యమవాలంటీర్లు ప్రచారంచేస్తూ పంచిపెడుతున్న పేపరు తీసుకొచ్చి చదువుతున్నా. ఈ లంచగొండి తనాన్ని గూర్చి పటేల్, నెహూ్రిమొదలైనభారతనాయకులు చెప్పిన ఉపన్యాసాలు యీ పేపర్ లో వేశారు. ఇది చదువుతుంటే ఈ లంచాల పిశాచం భారతదేశంలో ప్రతి డిపార్టుమెంటులోనూ ఎంతగా జీర్ణించిపోయిందా అని ఆశ్చర్యంవేస్తున్నది.

గోప:- (మంచంవాల్చుకొని కూర్చుంటూ) అవునురా! ఈ లంచాల పిశాచం పాలుబోసి పెంచిన పాములాగా ప్రజలను నాశనంజేస్తున్నది.

(వీరన్నప్రవేశం. వయస్సు 25. అనాగరికంగావుంటాడు. పిసినిగొట్టు. చినిగి మోకాలిపైకిగట్టిన ధోవతి, మాసికలు వేసిన బనీను, ముక్కుకు పోగు, చెవిలో సగంకాలి ఆరినచుట్ట, చేతిలో కర్ర, జేబులోనున్న వేలపిండి నోటినిండా పోసుకుంటూ కోతిలాగామూతిబెట్టి మింగుతూ వస్తాడు.)

వీరా:-ఇతనివేషంలో ఎప్పడూ మార్పుండదు.

వేణు:- (పీరన్నను చూచి) అదేమిటోయ్ పీరన్న బావా! హనుమంతుడి మూతిలాగా, నోరుపట్టకుండా కూరుకుంటున్నా వేమిటి?

పీర:- (తిని) పేలపిండి పలారవోయ్ బావా!

గోప:- ఇప్పుడేం పేలపిండి రా? పేలపిండిపండుగబోయి చాలా రోజులయిందిగా?

పీర:- అయితేమేం మావా! పేదన్నా పిండోంటలు సేత్తే ఎంతో డబ్బు కర్సుగందా. అందుసేత సవగ్గా తయారవుద్దని మా అమ్మ సమచ్చరానికొక్క పాలే సాకి బానెడు కొట్టి సేను కెల్లేప్పుడల్లా జేబునిండా పెడతావుంటది.

(కమల ప్రవేశము. వయస్సు 16. చదువుకొన్నది)

కమ:- నాన్నా! అన్నయ్యనూ, నిన్నూ అన్నానికి లేవమంటున్నదమ్మ.

గోప:- లేస్తాలేఅమ్మా, కాసేపుండి. ఇప్పుడేగా పొలంనుంచి వచ్చింది.

పీర:- (ఎగతాళిగా) పాపం కవల కంచం సద్దెణ్ణంతో కటికుపోసం గావాల్ను,కడుపులో సెత్త మాడుతుండట్టుండది.

కమ:- పొట్టపగిలేటట్టు నువ్వు భోంచేసి వచ్చావుగా?

పీర:- యెంత రోసం వచ్చిందో సూడు మావా! ఎసువుంటి మొగుణ్ణి తెత్తావోగాని యదవ సన్నాసోడికింద కటే

సెట్టుండది. అడగటం మరిసిపోయాను, అమ్మాయి పెళ్లెప్పుడు సేత్తావు మావా!

గోప:- అమ్మాయి పెళ్లి అవ్వాడే ముడిబడ్డదిలేరా! ఎంత మంది కానివాళ్ళ కాళ్ళు, గడ్డాలు పట్టుకొని బ్రతిమి లాడనిదే ఏమయిందిరా!

వీర:- యెందుకు మావా! అంత కానోళ్ల కాళ్లు, గడ్డాలు, పట్టుకోటం? పక్కింటో పాడమున్నంటోణ్ణి సేసుండగా పైపయ్యోళ్ళను బతిమిలాడ్డం దేనికి మావా!

కమ:- (వెళతాళిగా) పండు, నేరేడుపండు.

వీర:- అబ్బో? ఎర్రతేలు నాగా ఎనువుంటి పోటు పొడిసిందో సూడు మావా!

గోప:- ఇంత ప్రొద్దెక్కినదాకా యిక్కడే వున్నావేంగా యివాళ? యింకా పొలంబోలేదేం?

వీర:- పోతుండా మావా! బోంచేసి పొలం పోతూ పోతూ పోగాకు సుట్ట కాల్చుకుందామని యిటొచ్చాను. కాత్త అగ్గిపెట్టియ్ మావా! (చెవిలో సుట్ట కోట్లో పెట్టుకుంటాడు)

గోప:- (అగ్గిపెట్టిస్తూ) అయితే అగ్గిపెట్టెకూడా కొనకుండా ఆదా యంలో పడ్డావన్నమాట.

వీర:- (అగ్గిపెట్టె తీసుకొంటూ) యేం ఆదాయంలే మావా! కొందామని ఎన్నిసార్లు కోమిటింటికెల్లినా ఆసన్నా సోడు నాకప్పే యివ్వానన్నాడు,

వేణు:- ఎంగిలిచుట్ట ఎక్కడేరుకొచ్చావోయ్ బావా!

వీర:— యెంగిలిసుట్టా? యెర్రి మొగోన్ననుకోన్నావా యేంది?
దవడ పీకుడు లంకెల్లి తక్కినోల్లందరికంటె సవా సేరు
అగాకు సవగ్గా బేరవాడి అరదణా బెట్టి అరదచసటాకు
తెచ్చి ఆరునెలలనుంచి అతి పొదంగా వాడుతుండా.
ఇదిగో ! యీ సుట్టసూశావా ! అయిదురోజులనుంచీ
తాగుతుండా [illegible]సమైన తగ్గకుండా యెట్టా ఆటి
కాల్తుండదో ?

వేణు:— అంత మంచి పొగాకన్నమాట ?

వీర:— మంచి పొగాకేంది ? మనదేశంలోనే లేదు యిసు
వుంటిది. మనమొకంసూసి మంచిరకం దీసిచ్చాడా
మడిసి.

గోప:— ఇంతకీ ఆచుట్ట కాల్తుందిట్రా ?

వీర:— కాలకేం మావా ! అగ్గిపుల్లగీసి ఆపర్న సుట్టమీానెడితే
ఆ వెలిగినంతసేపూ ఇదికాల్తానేవుంటది. (అని అగ్గిపుల్లలు
రెండుమూడు గీచినా ఆచుట్ట కాలక దవడపీక్కుపోయేటట్లు
తాగుతూవుంటాడు.)

గోప:— (అగ్గిపుల్లలన్నీ గీచేస్తాడేమోనని ఆదుర్దాతో) ఏదీ అగ్గిపెట్టె
యిటు తే. (తీసుకొని) అగ్గిపెట్టె సొంతం అయినా ఆ
చుట్ట మాత్రం అంటుకోదన్నమాట,

వీర:— అదుగదీ. అసలు దాని నాణెం కనుకున్నావు మావా!
యిసువుంటి నాణెమైన పొగాకు తాగుతుండానని నా
యాల పెతివోడూ దిట్టి గొట్టేవాడేగందా. అందరి

దిట్టి కొట్టి అగ్గిపుల్లలాగు యెట్టా సిక్కిపోయ్నావో
సూడు మావా! (వల్లిచూచుకొనును)

కమ:- చిక్కి, చిక్కి, చింతమొద్దు మొదలైనాడు పాపం.

వేణు:- ఈమధ్యనీకు పూటకుమూడు సోలలకంటే భోజనమే సయించటంలేదుటగా వీరన్న బావా!

వీర:- (విసుగుతో) యేం మూడుసోల్లో. అదైనా యీ రేసనింగొచ్చిన తరువాత రెండుపూటలుతప్పితే మూడోపూట లేదుగందా?

గోప:- ధాన్యమేమీ నిలవబోసుకో లేదుట్రా?

వీర:- పోసుకో కేంమావా! యిదేంపావకరమోగాని యీ రేసనింగోల్లు పండిన దాన్నెం తింటానికి పడనియ్యరు గందా? పాతికబత్తాలు నిలబోసుకొంటే, ఈ రేసనింగోల్లొచ్చి ఏందో లెకంకటలెక్క, ఆలెక్కపకారవంటూ రెండు బత్తాలుంచి తక్కినయి తీసుకెల్తుంటే అయిదు బత్తాలైనా తిండికుంచమని అంతబతిమిలాడినా యినక పాతిక రూపాయలు లంచమిచ్చేతలికి పదియేను బత్తాలుంచెల్లారు మావా!

వేణు:- రేసనింగుడిపార్టు మెంటుకు గూడా ప్రాకిందీ లంచ గొండితనం!

గోప:- ఏడిపార్టుమెంటైతే నేంరా, ప్రజలను వేధించుకు తింటానికి.

(దుర్గమ్మ ప్రవేశం. వయసు సు 40. కొంచెంచదువుకొన్నది. మాటకారి)

దుర్గమ్మ:- ఏమిటిది? ప్రొద్దెక్కినా భోజనానికి లేవరేం?

ఏవో కబుర్లతో కాలక్షేపం చేస్తున్నట్లున్నారే?

వీర:- కబుర్లేమున్నై దురగమ్మత్తా! యేదో యాలాకోలా లాడుకుంటుండాము.

దుర్గ:- వేళాకోళా లాడుకోటానికి వేళ పాళా అక్కర్లా?

వేణు:- ఉండవే అమ్మా! ఇప్పుడేగా నాన్న పొలంనుంచి వచ్చింది. అయితే నాన్నా! యీలంచాల పిశాచాన్ని నిర్మూలించటానికి మార్గమే లేదా ఏమిటి?

గోప:- లేకేం, ఉన్నది. కాని, యెంతమంది మహానుభావులో దీనిని పోగొట్టాలని విశ్వప్రయత్నంచేసివిసిగిపోతున్నారు.

వేణు:- మరి మొన్న మొన్నటిదాకా మనదేశాన్ని పరిపాలించిన బ్రిటిష్ ప్రభుత్వం మంచిదనిమాహిస్టరీలో చెప్పారే? తన ఉద్యోగులు ఈ తప్పుడు పనులుచేస్తుంటే తగిన చర్య తీసుకోలేదా ?

గోప:- (లేచి) ఓరినీహిస్టరీ యేట్లోగలవ, అందులో ఉన్నవన్నీ అబద్ధపు వ్రాతలేగా.

గీ. మన చరిత్రలో నిజమంత మాటు పరచి
లక్షలాదిగ కవులకు లంచమిచ్చి
కల్లచరిత లల్లించిరా తెల్లవారు
చల్లగా తమ ప్రభుత వర్ధిల్లుకొరకు

అసలు మనవాళ్ళకీ లంచగొండితనాన్ని నేర్పింది బ్రిటీష్ వాళ్ళేగా ? రాజ్యాలు కాజేయటానికి లంచాలిచ్చుకొంటూ మంచితనంగా మనదేశంలో ప్రవేశించారు.

దుర్గ:- అనుకున్నా వేణూ! నేనీయింట్లో ప్రవేశించిందిగూడా మీనాయనగారిక్కి లంచమిచ్చే.

గోప:- అంటించావే ముక్కకు ముక్క. అయినా నాకిచ్చింది కట్నంగాని లంచమెట్లాఅవుతుంది?

దుర్గ:- ఆరెండూ ఒకటే. లంచానికి పెట్టుకున్నముద్దు పేరేకట్నం. ఇక లేచిరండి అన్నానికి, మన ప్రక్కయింట్లో నున్న పంతులమ్మ ఊరికెళ్తుందట, పోయిపలుకరించిరావాలి.

కమ:- ఏవూరెళ్తుందే ఆపంతులమ్మ?

దుర్గ:- ఉద్యోగంకాస్తా పోయిందిగా. అందుకని వాళ్లవూరు వెళ్లిపోతున్నది.

గోప:- అయ్యోయ్యో! ఎందుకు పోయిందే ఆ పంతులమ్మ కుద్యోగం? చదువు, అదీ, బాగానే చెప్తుందిటగా?

దుర్గ:- బాగానే చెప్తుంది. సరిపడనివాళ్లేవో చాడీలుచెప్పి పైవాళ్లకు పాతికో, యాభయ్యో, లంచంపెట్టి ఉద్యోగం కాస్తా ఊడగొట్టించారు. అదీగాక పంతకం గూడాచేతగాని చవటమొహం ప్రెసిడెంటుగారు మాపటిపూట మకాం జెయ్యటానికొస్తే మర్యాద కోసం మంచం వేయలేదట.

వీర:- మంచం దేనికత్తా! కురిసీలుంటయ్‌గా?

దుర్గ:- ఉంటయ్‌లే కుర్చీలు. అడ్డమైనవాళ్లకు అధికారం నెత్తికొచ్చేటప్పటికి అవలక్షణాలన్నీ అంటుపడతయ్. ఇంకా యిదేమిటి? ఆ మడమలెత్తి నడిచే మాసెమ్మ దొరసానికి మామూలు ముట్టజెప్పలేదట, మొహం

మార్చుకుంటూ వెళ్లిపోయింది.

వేణు:- మామూలేమిటి?

దుర్గ:- మామూలు నేది లంచానికి మారుపేర్రా.

వీర:- అయితే నాకు తెలవక అడుగుతుండాగా సత్తె! సదువురాని నాబోటి సవట దద్దన్నలు గూడా పెసిడెంటుగా వుంటానికి పనికొత్తారన్నమాట?

దుర్గ:-పనికిరాకేంరా అల్లుడా! పచ్చనోట్లు మార్చి పంచు తేసరి.

గీ. సంతకముగూడ నెరుగని జనులుకొంద
రర్థమును వెచ్చబెట్టి యధ్యక్షులగుచు
నీతి నియమాల మరచి సువూతలైన
వంతులమ్మల మార్చు టబ్బరమె, చెపుము?

వేణు:- (లేచి) ఈ మామూళ్లిచ్చుకోలేక పోతే ఉద్యోగం కాస్తాపోవలసిందేనా?

గీ. లంచమీయకున్న లవలేశమేనియు
పాప భీతిలేక బ్రతుకు గూల్చ
న్యాయమౌనె? యిట్లుసేయలోకంబున
పేదసాద జనులకేది దిక్కు?

కమ:- నిజమే నన్నయ్యా! ఈలంచాలిచ్చుకోలేక ఎంత మంది ఉద్యోగాలుపోయి విచారిస్తున్నారో.

గీ. చాలి చాలని జీతముల్ రాలువార
లెంద రెందరో లంచంబులీయ లేక
అన్నమున్నీళ్ళకొరకునై అలమటించు
చుండిరోగద కంటి నీరెండి పోవ

వేణు;- సరేగాని నాన్నా !

గీ. ప్రజలమంత్రులెయిప్పుడు పాలనంబు
నెరపుచున్నారుగద యెంతో నేర్పుమీర
ప్రజల వేధించి పీడించి పట్టి దోచు
లంచ గొండుల బట్టి శిక్షించలేర ?

గోప;- శిక్షించకేం ? సి. ఐ. డీ.లను వేసిపట్టుకొని కొంతమందిని శిక్షించారు కూడాను. అసలు ప్రజల సహాకారం లేనిది ప్రజాప్రభుత్వాలు మాత్రం ఏంజేస్తయ్‌రా ! ప్రజలలోనే కొంతమంది స్వార్థపరులు ఏదో ఒక నేరం చేసి తప్పించుకోటానికో, ఎవరి మీదనైనా కక్ష తీర్చుకోటానికో, ఏవో దొంగలాభాలు తీయడానికో, తమ అవసరాలకొద్దీ లంచాలిస్తుంటే ఒద్దనేవాడు ఒక్కడైనా వుంటాడటరా !

గీ. ప్రజలలో స్వార్థకాంక్షలు ప్రబలుచుండ
తెచ్చి చాటుగ లంచమ్ము లిచ్చుచుండ
దొరతనపు బంట్లు ప్రజలను దోచుచుండ
లంచ మయమయిపోయె ప్రపంచమెల్ల

ఏనాడు ప్రజలలో స్వార్థం నశించి లంచాలివ్వటం మానివేస్తారో ఆనాడే యీలంచాల పిశాచం నామ రూపాలు లేకుండా నాశన మవుతుంది.

కమ;- మరి యివ్వకపోతే ఉద్యోగులు ఊరుకుంటారా నాన్నా!

వీర:- ఊరుకోకపోతే ఊరిపెట్టుకుంటారు. అంతేగంద మావా!

గోప:- అంతేరా వీరన్నా! ప్రజలంతా అయికమత్యంగావుండి లంచాలివ్వటం మానివేస్తే ఏఉద్యోగులైనా ఏం జేస్తారురా!

వేణు:- మరిఅట్లాగే ఉండకూడదూ?

గోప:- ఉంటేమంచిదే. కాని చాలాకష్టం. ఎందుకంటే.

గీ. పనియు పాటయు లేనట్టి భ్రష్టులైన
పరమనీచులు కొందరు పదవికొరకు
పార్టిలంచు తగాదాలు ప్రబలజేయ
ప్రజలలో నైకమత్యంబు వరగుటెటుల?

దుర్గ:- అంతేగాదురా వేణూ! అసలు మనఆంధ్రదేశంలో ఐకమత్యం కుదరటానికి అవకాశం ఉన్నదా, అనినా అనుమానం. ఎందుకంటే ఎదటివాడు ఏదైనా మంచి పని జేస్తున్నా యేడ్చేవెధవలు యెంతమంది?

గీ. మంచిమార్గమ్ము సూప నుంకించువారి
గేలిసేయుదు రదిరెట్టి బేలతనము
ఓర్పు లేదు మచ్చునకైన నేర్పు లేదు
ఆంధ్ర దేశీయులందు రవ్వంతయైన

గోప:- అదీగాక మన దురదృష్టమేమో మనమే అనుకుంటే మననాయకులలో కూడా ఐకమత్యం లేదు. ఎంత

సేవా పదవులకొరకు ప్రాకులాటేగాని, ప్రజాక్షేమం కొరకు పాటుబడటం లేదుగదా.

గీ. ఆంధ్రమున బహునాయకులైన కతన
తత్వమెరుగని ప్రజతప్పుదారిబడెయొ
ఎవ్వరికివారె నాయకు లెంచి చూడ
తెలుగుదేశ దౌర్భాగ్య మదేమొకాని

వేణు;- అయితే, ఐకమత్యంగా వుండటానికి అవకాశమే లేదా?

గోప;- చాలా కష్టమైన కార్యం.

(జీతగాడు అప్పడు అన్నముగిన్నె, కాళ్ళు, చేతులు ముఖం తుడుచుకొంటూ ప్రవేశము)

అప్పడు;- అన్నం బెట్టండి దురగమ్మగోరూ! పొలం యెల్లాలి.

గోప:- ఏమిరా అప్పడూ! కాలవకు నీళ్లువచ్చినయ్యా?

అప్ప:- రాలేదుండి. ఆవోర్సీల్ గోరికి తక్కీసవిత్తేగాని వదలడంటగా!

వేణు:- తక్కీ నమేమిటి?

దుర్గ:- లంచాల పిశాచానికుండేలక్ష పేర్లలో యిదొకటి.

గోప:- ఇదేమ న్యాయంరా?

గీ. మాలువచ్చిన రాకున్న సాలుసాలు
శిస్తులనుగట్టుచుందుము పస్తైయుండి
బాపురే? యిట్టితక్కీసాల్ బాధకడలి
యెందరు కృషీవలులు నాశమందినారొ?

వేణు;- అయితే నాన్నా! యీ లంచగొండితనం ఇట్లాసాగ
వలసిందేనా?

గీ. అంతులేనియట్టి అధికార్ల దౌర్జన్య
మెంత కాలమిటు సహించియుండ
మించిపోయినట్టి లంచపిశాచిని
త్రుంచివేయ సాహసించవలయు

కమ;- అవునురా అన్నయ్యా! ఇకనెంతమాత్రం సహించ
గూడదురా.

గీ.- ప్రజల కష్టములతో పనిలేనియట్టి యీ
లంచగొండుల తొలగించవలయు
నీతిలేకయిట్లు నిలువు దోపిడిసేయు
చుండ నింక నూరకుండనేల ?

వేణు;- అవునునాన్నా! ఈలంచగొండి తనాన్ని అరికట్టక
పోతే లాభంలేదు.

దుర్గ;- ఏంలాభంరా, లాభం?

గీ. ఎన్నికబురులు చెప్పిన నేమిఫలము
తక్కెసాల్ గట్టకుండ మీతండ్రిగారి
చేతనౌనా యికెందుకు, చేతలెవుడు
కావలయు గాని మాటలక్ కార్యమౌనె?

గోప;- ఏంజెయ్యామంటావే? ఊరందరిది ఒకదారి ఉలిపికట్టె
దొకదారి అన్నట్లు నాఒక్కడివల్ల ఏమవుతుంది?

అందరూకలిసినస్తే అలాగే కట్టకుండామాం నేసేద్దును.

వీర:- నిజమేనత్తా! యింటాక మనోల్లంతా మాట్లాడుకొని ఈతక్కిసాలు ఏసూలు జేసే పెత్తనాన్ని గూడా మావసెత్తిమీనే యేశారు.

దుర్గ:- ఎందుకీ పనికిమాలిన సంభాషణ. పదండి అన్నానికి. పదిగంటలు గూడాకావస్తున్నది. మధ్యాహ్నంనుంచి మైనాపురం వెళ్లాలిగద, అబ్బాయి చదువుకు.

వేణు:- అవును, యీదసరా శెలవులు యివ్వాల్టితోనే అయిపోయినయ్. కాలేజీ రేపే తెరుస్తారు.

గోప:- నేనుగూడా మధ్యాహ్నంనుంచి ఎరువుపిండి కోసం వ్యవసాయడిమాన్‌స్ట్రేటరు దగ్గరికెళ్ళి రావాలి.

వీర;- ఓస్బిల్ కాడిగ్గూడా యెల్లొత్తావుగంద మావా!

గోప;- ఆ. వెళ్ళివస్తాలే.

దుర్గ:- ఇంట్లో బియ్యం అయిపోయినయ్. మధ్యాహ్నంనుంచి బస్తీ కెళ్తానంటున్నారు కనుక మరగూడా పట్టించుకు రారాదూ?

గోప;- మరపట్టించుకు రావటానికి పర్మిషన్ ఇచ్చేటందుకు పదిరోజులనుంచీ తిప్పుతున్నాడా తాలూకా సప్లై ఆఫీసరు. అనక అటుగూడాపోయివస్తాలే. రారా వేణూ! అన్నానికి (పోవును)

దుర్గ;- అప్పడూ! అటుదొడ్లోకిరాకా! అన్నం పెడ్తాను.

(అందరు పోవుదురు)

(తెరపడును)

# 2 వ రంగం

(వ్యవసాయ డిమాన్‌స్ట్రేటరు ఆఫీసుముందు తలగడ్డ, మెట్లో జంపెం లాగా ఉన్న బిళ్ళమీదుగా నడుముకు గుడ్డచుట్టుకొని బిళ్ళబంట్రోతు నిల్చొని వుంటాడు.)

గోప:- (ప్రవేశించి) డిమాన్‌స్ట్రేటరుగారు లోపలవున్నారా ?

బంట్రో;- ఉన్నారు,

గోప:- కొంచెం వారితో మాట్లాడాలి. లోపలికి పోవచ్చునా?

బంట్రో;- వీల్లేదు. ఏదోపనిమీద వున్నారు.

గోప;- ఏంపనిమీద వున్నారేం ?

బంట్రో;- ఏమోనండి. నాకు తెలియదు. ఏంపనిమీద వున్నారో మీకు చెప్పాలాయేం ? ఏవోలక్షపనులుంటయ్ వారికి,

గోప,- అందుకుగాదయ్యా! వారేంపనిమీదవుంటేనాకు దేనికి? నాకు యెరువులపిండి గావాలి. అవిషయమైమాట్లాడటానికివచ్చాను. ఇప్పుడువీలుందో, లేదో కాస్త కనుక్కురా!

బంట్రో;- (కోపంతో) వారికీ, మీకు, మధ్య అసులో గొట్టంలాగా అటూ యిటూతిరగటానికి మీరేమైనా జీతమిచ్చి నిలబెట్టారా యేమిటండి? ఇప్పుడు వీలు లేదు. రేపురండి.

గోప;- ఏమిటయ్యా, మహాదాష్టీకంగా మాట్లాడతావ్ ?

బంట్రో;- దాష్టీకమేమిటండీ! ఎవరైనా ఉర్కినే ఏపనైనా చేస్తారుటండి !

గోప;- అయితే లంచంకావాలన్నమాట.

బంట్రోతు;- లంచ మేమిటండీ! కష్టం అడుగుతున్నాను.

గోప;- అట్లాగా. (జేబులోనుంచితీసి) సరే, ఈఅర్ధరూపాయి తీసుకో.

బంట్రో;-చాల్లెండి. మీరుగాబట్టి యిచ్చారు అర్ధరూపాయి, ఇంతవరకు యెవరూగూడా రెండురూపాయలకు తక్కువ ఇవ్వలేదు.

గోప;- అబ్బో! చాలాదా కావుందేవ్యవహారం? అంత లేదు గాని యీఅర్ధరూపాయి తీసుకోలే.

బంట్రో;- తీసుకోనండి.

గోప;- (మళ్లీజేబులోనుంచితీసి) సరే, యీరూపాయి తీసుకో.

బంట్రో;- (తీసుకుంటూ) ఏంరూపాయండీ, రూపాయి? మీతో తగాదాదేనికని తీసుకోటమేగాని. యిక్కడే వుండండి. అయ్యగార్ని కనుక్కు వస్తాను. (తెరలోకివెళ్ళి తిరిగివచ్చి) రండి. అయ్యగారు లోపలికి రమ్మంటున్నారు. (లోపలికి పోవును)

గోప;- (బంట్రోతు వెంట లోపలికి పోవును.)

(తెరయెత్తగానే)

(ఫుల్ సూటుతో డివాన్ ప్రేటుయ కుర్చీ మీద కూర్చొని డ్రాయరుమీద పుస్తకములో వ్రాసుకొంటూవుంటాడు. ప్రక్కగా ఇంకొక కుర్చీ వుంటుంది.)

గోప;- (ప్రవేశించి) నమస్కారమండి.

డివాన్;- రండి కూర్చోండి.

గోప;- (కుర్చీలో కూర్చొనును.)

డిమాన్:- ఏంపనిమీద వచ్చారు ?

గోప:- ఎరువుల పిండి కావాలండి.

డిమాన్:- ఎంత కావాలి ?

గోప:- పాతిక బస్తాలండి.

డిమాన్:- పాతిక బస్తాలే ? నో, నో, నో. ఒక్కబస్తా తప్ప యివ్వటానికి వీల్లేదు.

గోప:- అయ్యయ్యో! చాలాదూరంనుంచి యెంతో ఆశతో వచ్చానండి. పదిహేనుబస్తాలైనా యివ్వకపోతే చేను పాడైపోతుందండి.

డిమాన్:- పదిహేనుబస్తాలు మాత్రంపైపైనవున్నదా యివ్వటానికి. పచ్చ పచ్చగా కనబరుస్తే పది బస్తాలవరకూ యిస్తాను.

గోప:- అంటే ?

డిమాన్:- మీరుచాలా అమాయకుల్లాగా వున్నారే! పచ్చ పచ్చగా అంటే తెలీదూ ? పచ్చనోటండి, పదిపదులు.

గోప:- వందరూపాయలా ?

డిమాన్:- అంతేనండి.

గోప:- అంటేలంచం యివ్వాలన్నమాట.

డిమాన్:- లంచమేమిటండీ, లాంఛనంగా యిచ్చేదానికి.

గోప:- బీదవాణ్ణి. యిచ్చుకోలేనండి,

డిమాన్:- యిచ్చుకోలేకపోతే ఇంటికి వెళ్ళండి. యిదేదారి.

గోప:- అట్లామాట్లాడితేయెట్లాచెప్పండి. (ఆలోచించిజేబులో నుంచితీసి) యీా అయిదు రూపాయిలు తీసుకోండి.

డిమాన్:- అయిదు రూపాయలా? అయిదు రూపాయలు తీసుకోటం మనకలవాటే లేదు.
గోప:- అయ్యా! ఇంతకంటే యిచ్చుకోలేనండి.
డిమాన్:- (పెదవి విరుస్తూ) ఎబ్బే. ఏమీలాభం లేదండి.
గోప:- అయితే అంతాయిచ్చుకోవలసిందేనా?
డిమాన్:- అక్షరాలా.
గోప:- అంతయివ్వలేనండి. (మళ్ళీ జేబులోనుంచితీసి) ఈ యిరవై రూపాయలు తీసుకోండి.
డిమాన్:- ఇరవైరూపాయలు తీసుకోటం యెరువుల పిండి వ్యవహారంలో యెప్పుడూ లేదు.
గోప:- (లేస్తూ) ఎరువులపిండి వ్యవహారమా? ఎముకలు పిండే వ్యవహారమా?
డిమాన్:- (నవ్వుతూ ఎగతాళిగా) ఎముకల పిండి కూడా వుంది. ఇవ్వమంటారా?
గోప:- ఎందుకండీ, అంత యెగతాళి?
డిమాన్:- ఎగతాళేముందండీ? యేపిండి కావాలిమీకు?
గోప:- (విసుగుతో) ఆ, వేరుశనగపిండి.
డిమాన్:- వేరుశనగపిండి కైతే యాభైరూపాయలు. ఆమోనియాకైతే అరవైరూపాయలు. సూపరుకైతే వంద. ఈ ప్రకారం మా మామూలిచ్చి మీకేపిండి కావాలంటే దానికే పర్మిషన్ ఇస్తాను.
గోప:- ఏమిటండీ యిది? లంచాలలో కూడా కోమటిబేరమా? కోమట్లరాజ్యం పోయింది కదండీ?

డిమాన్:- కోమట్లరాజ్యం పోవటానికి కారణం మళ్ళీ కోమ టేగా? అందుకని గల్లా పెట్టెయెప్పుడూ ఘల్ ఘల్ లాడుతూ వుండాలిసిందే.

గోప:- ఎందుకండీ మనకీమాటలనవసరంగా. అంతయివ్వలేను తీసుకోండి.

డిమాన్:- ఇవ్వలేకపోతే వీల్లేదండి. అయిదు పదులు పడితేనే ఆర్డరు యివ్వటం.

గోప:- (బతిమిలాడుతూ) పేదవాణ్ణండి. అంతయివ్వలేనండి. (మళ్ళీ జేబులోనుండితీసి) పోనీ యీ ముప్ఫై రూపాయలు తీసుకోండి.

డిమాన్:- నో, నో. నో. యాభై రూపాయలకు రవమాత్రం తగ్గినా వప్పుకోను.

గోప:- ఇవ్వలేనండి.

డిమాన్:- ఇవ్వలేకపోతే వెళ్ళమని ఇందాకనే చెప్పానుగా.

గోప:- (విసుగుతో జేబులోనుంచి తీసి) సరే, తీసుకోండి. పర్మిషన్ రాసిఇవ్వండి.

డిమాన్:- (యాభైరూపాయలు తీసుకొని జేబులో పెట్టుకొని పర్మిషన్ రాసియిచ్చును.)

గోప:- (పర్మిషన్ తీసుకొని ముందుకు వచ్చును.)

(గోపయ్య ముందుకు రాగానే గోపయ్యకు, డిమాన్ ట్రేటరుకు, మధ్యనున్న తెరపడును.)

గోప:- అయ్యయ్యో! ఇవెక్కడ లంచాలు. ఇదెక్కడ అన్యాయం? ఇందాక ఆశాలూశా సప్లైఆఫీసరు పాతిక రూపాయలు లంచమిస్తే గాని పర్మిషన్ మీద సంతకమే పెట్టనన్నాడు. ఇక ఓవర్సీల్ గారికి యాభై రూపాయలిచ్చి సరిపెట్టే టప్పటికి నా మొహం మూళ్ళ తరాల వాళ్ళూ దిగివచ్చారు. ఈ వ్యవసాయ డిమాన్‌స్ట్రేటరుకు యాభై రూపాయలు లంచం. ఈ లంచాలతో చచ్చిపోయే రోజొచ్చింది. తెచ్చిన డబ్బంతా లంచాలకే సరిపోయింది, పైగా లంచం అనకూడదట. లాంఛనం అనాలట.

సీ. పచ్చ పచ్చగ నన్న వందగూప్యములంట
ఇది యేమి అర్థమో యెరుగరాదు
మరి మరి రమ్మన్న తరి లంచమునకని
యెరుగంగ నలెనంట యింగితంబు
లంచంబు గోరుట వంచన యనిబల్క-
కాదుకాదది మాకు కట్నమును
ఎంతవేతనమైన నుంతతృప్తియు లేక
పై పెచ్చులంచముల్ బట్టమరిగి
గీ. విత్తమును లాగజూచు నీతోత్తులకును
కనికరము మచ్చునకునైన కానరాదు
అంత కంతకు నీతృష్ణయగ్గలింప
అడుగు మట్టము గాదె? రైతాంగమెల్ల.
(పోవును.) (తెరపడును.)

# 3 వ రంగము

## గోపయ్య గృహము

గోప:- (నార పేనుతూ వుంటాడు)

దుర్గ:- (రాట్నం త్రిప్పుతూ వుంటుంది)

కమ:- (లేసు అల్లుతూ వుంటుంది,)

కీర్తన-డైలాగ్-మాండ్-ఆదితాళం.

అందరు;- 1) చేతిపనులెగా-భారతభువిపై-జీవనమార్గమ్మేగాదా
భారతదేశ - దారిద్ర్యంబును-బాయగ జేయును
గాదా ॥చేతి॥

దుర్గ:- 2) చేతిపనులను-విడువభారత-సిరులేతొలగెనుగాదా
ఇడుమకట్ట-గతిమాలిమనమిటు-కుమిలి పోయితిమి
గాదా ॥చేతి॥

కమ:- 3) కూడు గుడ్డను - కలిగియిరలను-కోలుకొనియు-
బ్రతుకంగా
చేతిపనులె-కడుముఖ్యమగుటచే - చేయగలెండిక
వేగా ॥చేతి॥

గోప:- 4) గాంధిజి చెప్పిన - కర్మసూత్రమిదే - కనుగొన
మనకగుత్రోవా
భరతమాతనిటు-పట్టి పీల్చుచుయీ-కరవు పిశాచము
పోవా ॥చేతి॥

(సూచన - కీర్తన మొదలు పెట్టినతరువాతనే తెరయెత్తవలెను.)

వీరన్న:- (ప్రవేశించి) యేందిమావా! గాంధీమాత్ములోటి సెప్పాడంటుండావు? యేంసెప్పాడేంటినీతో.

గోప:- నాతో చెప్పటంగాదురా. చేతిపనులనుగూర్చి ఆయన ఉపన్యాసాలూ, అవీ, అప్పుడప్పుడు పత్రికల్లో పడుతుంటయ్, నువ్వువినలా?

వీర:- యినకేం మావా! అరుగుకాడ రోజూ అందరపిత్రిక సదూతూంటే ఆళ్ల తెలివియి కనుక్కుందామని మద్దె మద్దె అడ్డపెసిన లేసేవోళ్లు. సమాదానం సెప్పలేక నాయాళ్ల సచ్చేవోళ్లు. అయితేమావా! సేతిపనులు నేరుసుకుంటే సెడుపే లేదంటావ్?

గోప:- అవును రా. చేతిపనులు నేర్చుకుంటే జీవనానికి లోటే వుండదు.

వీర:- అయితే మావా! నాకు తెలవక అడుగుతుండా గాని (చెవిలో చుట్టతీసి) ఈ సుట్ట సుట్టుకోటం గూడా సేతి పనే గందమావా!

గోప:- నీ తెలివి తెల్లవారినట్లుందిలే. సరేగాని తక్కిసం చందా యివ్వలేదేంరా?

వీర:- (తప్పించుకు పోవు ఉద్దేశ్యముతో బిత్తరిచూపులతో నసుగుతూ) మందేముంది మావా! మనోళ్లందరి కాడ వసూలుసేసి సద్దిరా మావా! సల్లగా సేతిలోవుండప్పు డిత్తాలే. పోతుండామావా! పొలంయెల్లాలి. (జేబులో పేలపిండి నోటిలోపోసుకొని పోవును.)

గోప:- తక్కిసం చందాఅడిగితేసరి, తప్పించుకుపుండే తెలివి మాత్రంవుంది.

కమ:- యివాళ అగ్గిపెట్టె అడగకుండా వెళ్లాడేం నాన్నా!

దుర్గ:- చందా సంగతియెత్తకుండా వుంటే చల్లగాఅడిగేవాడే.

(అప్పడు ప్రవేశము.)

అప్ప:- పొగాకు బెట్టండి అమ్మగోరూ ! పొలంయెల్లాలి.

దుర్గ:- (పోయి తెచ్చియిచ్చి అట్లాగేనుంచుంటుంది)

గోప:- ఏమిరా అప్పన్నా! కాలవకు నీళ్లేమైనావచ్చినయ్రా?

అప్ప:- రాలేదండి.

గోప:- మొన్న నేగదరా, ఓర్సీల్ మొహాన యాభైరూపా యలు పారేసింది ?

అప్ప:- ఆయనగోరికొక్కడికేగా యిచ్చింది ? మరిసబ్‌డీజ నాపీసరుకు గూడా తక్కినం సెల్లించకపోతే సాగుకు నీళ్లేనదలడంట. ఇందాక మనపొలంకాడ మైల్‌జమూకా కనభడిసెప్పాడు.

గోప:- (లేచి) దానితోనే నీళ్లువిడిచి పెట్టిస్తానని చెప్పాడ్రా ఆ ఓర్సీలు. ఇప్పుడు నీళ్లురాకపోతే ఈ సబ్‌డివిజ నాఫీసరుకు మళ్లీ లంచంపెట్టాల్సి వస్తుందా యేంరా?

అప్ప:- పెట్టొద్దంటండీ మరి, ఆరంతా పెద్దపెద్ద దొరనోర్లా యెను. నాయవెక్కడుందండీకాలంలో, పొద్దత్తమానం పొలంలో కట్టపడి పనిసేసే మాబోటి పీదకూలీలకు పొగాకు ముక్కగూడా పట్టిపట్టి బెడతారు, ఆరికైతే ఎన్నిసార్లు ఎన్నివందలైనా లంచాలకిందిత్తావుంటారు.

గోప:- సరేలే, చాలింతు నీ ఉపన్యాసం. పొలం వెళ్లికాలవకు అడ్డీవేసి గండికొట్టి సిద్ధంగావుండు. ఆనక వెళ్ళి ఆఫీసర్ తో నేను మాట్లాడివస్తాలే.

అప్పు:- (పోవును.)

కమ:- (లేచి) నాన్నా! ఈవిధంగా లంచాలు బెడితే యెట్లా?

గీ. తేనె బూసినకత్తులై తెలియరాక
రైతురక్తము పీల్చు దుర్మార్గలంచ
గొండియుద్యోగులొనరించు దుండగమున
కూలిపోవవె ? మనకొంపగోడులెల్ల

గోప:- మరెందుకు వచ్చిందీలంచగొండితనం ?

గీ. అశపోతులైన అధికార్లు లంచముల్ల
కొరకు నుంతయైన కరుణ లేక
రైతుగుండెకాయ రంపముల్తో గోయ
కూలిపోవకెట్లు మేలు కలుగు

దుర్గ:- నీళ్ళురాకపోతే నిన్నచేలో వేసిన పిండిపాడై పోదుటండీ!

గోప:- పాడై పోతుంది. ఆఓవ్సీలు నీళ్ళువిడిచి పెట్టిస్తానంటే నిన్న నే వేశాను.

దుర్గ:- ఇన్నిలంచాలుబోసి తెచ్చిన పదిబస్తాలపిండి పాడైపో యిందన్నమాట. ఈలంచాలతో ఈసంసారంగుండమై పోతున్నది. అబ్బాయి చదువు కోసం వాళ్ళదగ్గర,వీళ్ళ దగ్గరఅప్పుదెచ్చినరెండువందలుఅట్లాగేవుందిగదా,మళ్ళీ వాడు వెళ్ళివారంరోజులైనా కాలేదు, జీతాలకనీ, పుస్తకాలకనీ, హాస్టళ్ళకనీ, హోటళ్ళకనీ, మళ్ళీ వందరూపాయలు వదిలించాడు. ఇకఓవర్సీర్ తక్కిసానికి యాభైరూపాయలు. పర్మిషన్కి పాతిక రూపాయలు.

మొన్న మొన్న యెరువులపిండి తెచ్చినందుకు వ్యవసాయపు వాడికిచ్చిన యాభై రూపాయల లంచంగాక బ్లాక్ మార్కెట్టు భాగోతంతో సహా పాతిక తక్కువ రెండువందలు. మళ్లీ ఈసబ్ డివిజనాఫీసరుకు ఇంతో అంతో లంచం. ఇ కేం? ఆసావుకారు పుల్లయ్య దగ్గర అప్పుదెచ్చిన అయిదువందల రూపాయలు అరగానికైనా లేకుండా అన్నీ ఖర్చు బెట్టారుగదా. మీరేమైనా అనండి.

గీ. తరములకు మించిపోయిన తక్కిసాలు
గట్టనీరీతి నాసావుకారు నొద్ద
అప్పుసేతకు నామనసొప్పబోదు
యెప్పటికినైన మనకిది ముప్పుదెచ్చు

గోప:- ఏంజెయ్యమంటావే? ఎరువులపిండికొంటానికి ఎక్కడా మన వాళ్ళదగ్గర పైకం దొరకకపోతే ఆసావుకారు పుల్లయ్య దగ్గర అప్పుజెయ్యక తప్పలేదు.

దుర్గ:- పోనీ, చేసింది అప్పుగదా, ఎరువులపిండికొన్నవి పోను మిగిలినవి చేతిలో అట్టేపెట్టుకోక తక్కిసాలక్రింద తగలేసుకుంటారుటండి ?

గోప:- అవునే. అందరూపోయి తక్కిసాలుకట్టి వస్తుంటే మనం. కట్టకుండా యెట్లా ?

దుర్గ:- అయితేఅందరితోబాటు మనకూవుండాలిగానిఅధికంగా యీవందలేమిటండి ?

గోప:- అందరూకలసి బలవంతం జేసి ఈతక్కిసాలు వసూలు జేసీ పెత్తనాన్ని నానెత్తిమీదే పెట్టిన సంగతి నీకు తెలుసుగదా? ఈతక్కిసాలచందాలన్నీ వసూలవ్వ టప్పటికి చాలా రోజులుపడుతుందనిఅమిగిలినవిస్తద్దానం.

దుర్గ:- తక్కిసాల చందాలు వసూలైనయ్యా ?

గోప:- కొందరుఇచ్చారు, కొందరు ఇవ్వలేదు. తక్కిసాల చందా అడిగేటప్పటికి తప్పించుకొనే యీ వీరన్న లాంటి పెద్దమనుష్యులు యెందరున్నారంటావ్ ?

గీ. తక్కిసమ్ము గట్ట తమవంతుచందాల
నిత్తుమంచుబల్కి యింటిచుట్టు
ఒకటి రెండుగాదు ఒందసారులుద్రిప్పి
తుదకు సున్న జుట్టు తుచ్ఛులుండ్రి.

దుర్గ:- అయితే వసూలైనంతవరకూ అప్పులో యేమైనాచెల్లు వేశారా ?

గోప:- మొత్తం ఒకసారి వస్తే అలాగే చెల్లువేస్తును. అప్పు డొకరూపాయి, అప్పుడొకరూపాయి, వస్తుంటే ఉప్పు కో, పప్పుకో, యింటి క్రిందనే సరిపోతున్నయ్.

దుర్గ:- చేసినఅప్పులు చేసినట్లుగా నేఉన్నయ్యన్నమాట. ఎట్లా గైనా తగలేసుకోండి, నాకుమాత్రంమనసంసార పరిస్థితిఏమీ బాగుండలేదు. ఈయప్పులుచేసినందు కేఇరుగు పొరుగమ్మలు ఒకటేగుసగుసలు. పావలా అప్పుబుట్టే పరపతిగూడా చచ్చిపోయింది.

గీ. తెచ్చుటయోగాని బాకీలుదీర్ప లేమి
ఇరుగుపొరుగున పరపతి తరుగజొచ్చె
అంత కంతకు సంసారమడుగుబట్టె
అమ్మలక్కల నవ్వుల కగ్గమైతి.

గోప:- అయితే యేమంటావే ? యేఅప్పుజేసినా మీకోసం జేశానా, నాకోసమా ?

దుర్గ:- అవును మరి. మాకోసమేగా యీఅప్పంతా. మెళ్ళో యెప్పుడుజూసినా ఏకపుస్తె, ఏగానిబొందుతప్ప యిం కేమైనావున్నదా ? పలుపుల్లాగా గొలుసులు దిగేశారా, వరుసుకుపోయేటట్టు వడ్డాణాలు బెట్టారా? పోనీ అమ్మాయికేమైనా ఆభరణాలున్నయ్యా అంటే అన్నీ ఇత్తడివే తప్ప అరచిన్నం బంగారం గూడాలేదుగదా దాని వంటిమీద. ఎందుకండీ యీ అనవసరపు మా టలు. చెప్పకుంటే సిగ్గుచేటు గూడాను. మీకెట్లావుం దో గాని మనపరిస్థితి చూస్తే నాకుమాత్రం చాలా భయంగా వుంది. అప్పుతీరేమార్గం ఆలోచించండి.

గోప:- (ఆలోచిస్తూ) మరేంపర్వాలేదులే. దేవుడుచల్లగాజూసి అనుకున్నకాడికి అయివేజా పండి ఈధరలుయిట్లాగేనిల బడితే బాకీతీరి పాతికో, పరకో చేతిలో వుంటయ్‌లే.

దుర్గ:- (విసుగుగా) ఏమో, మీయిష్టంవచ్చినట్లు చేయండి.
(పోవును.)

గోప:- (ఆలోచిస్తూ వుంటాడు.)

(తెరపడును.)

# 4. వరంగం

(కుర్చీ, డ్రాయరు, ఉంటయ్. స్కౌట్ సిస్టంలో ఖాకీ హాఫ్ షర్టు, ఖాకీనిక్కరు, ఖాకీ మేజోళ్ళు, బూట్, హేట్‌తో సబ్‌డివిజనల్ ఆఫీసరు కుర్చీమీదకూర్చొని సిగరెట్ త్రాగుతూ వుంటాడు. ముందు డ్రాయర్ మీద సిగరెట్ పెట్టె, అగ్గిపెట్టె, కొన్ని కాగితాలు వుంటయ్. ఒక ప్రక్క మైల్ జవాన్ మాసి మట్టిగోచీ పెట్టిన పంచె, మాసిన సగంచేతుల చొక్కాతో, చేగొడలిబుజానబెట్టుకొనినిల్చొని వుంటాడు. మరొకప్రక్క కాగితాలందిస్తూ టోపాదు గుమాస్తా నిల్చొని వుంటాడు. ఇతనికి తలగుడ్డ వుంటుంది. కోటువున్నా లేకున్నా పర్వాలేదు.)

(తెరయెత్తగానే)

సబ్:- [సిగరెట్ త్రాగుతూ టోపాదుగుమస్తా అందిస్తూన్న కాగితములు తనిఖీచేసి సంతకములుపెడుతూ రెండు మూడు కాగితాలయిన తర్వాత ఒక కాగితం జూచి కోపంతో సిగరెట్ పారేసి డ్రాయరుమీద గుద్ది] ఏమిటయ్యాఇది ? కాలవలో నాలుగడుగుల నీళ్ళు ఎవరు విడిచి పెట్టమని చెప్పారు?

టోపా:- (చేతులు నలుపుకొంటూ భయంతో) చిత్తమండి.

సబ్:- నాఆర్డరు లేకుండా నాలుగడుగులనీళ్ళు ఎవరువిడిచిపెట్ట మన్నారయ్యా ?

టోపా:- చిత్తమండి.

సబ్:- ఏమిచిత్తమయ్యా, చిత్తం ?

టోపా:- చిత్తమండి.

సబ్:- (కోపంతో) అట్లాచూస్తావేమయ్యా? అన్నినీళ్లుఎందుకు విడిచిపెట్టారు? సమాధానంచెప్పవేమయ్యా?

టోపా:- (గద్గద స్వరముతో ఉమ్మి మింగుతూ) చిత్తమండి. ఆలాక్ సూపరెంటెమో లంచాలు తీసుకొని పడవల కోసం నీళ్లువిడిచి పెట్టాడటండి.

సబ్:- వాడు విడిచిపెడితే నీవేంజేస్తున్నావ్? ఇన్నాళ్లనుంచి టోపాదు గుమాస్తా పనిజేస్తూ ఈమాత్రం తెలీదుటయ్యా నీకు? పారుదల బాగా సాగుతుంటే పైసా యిచ్చేవారైతేవడైనా వుంటాడటయ్యా?

టోపా:- చిత్తమండి. పంట కాలవలకు పారుదల గాకుండా తూములకు తలుపులు వేసి తాళాలుబిగించమని మైల్ జవాన్ తో చెప్పానండి.

సబ్:- ఆల్ రైట్, అట్లావుండాలివర్క్. (మైల్ జవాన్నుచూసి) ఏయ్! మైల్ జవాన్! తలుపులు గట్టిగా వేసి తాళాలు బిగించావా?

మైల్:- చిత్తమండి.

(గోపయ్య మైల్ జవాన్ వైపుగా ప్రవేశము.)

గోప:- నమస్కారమండి.

సబ్:- ఎవరునీవు, ఏంపనిమీదవచ్చావ్?

గోప:- నీళ్లు రావటంలేదండి. తమతో మనవి జేసుకొందామని వచ్చాను.

సబ్:- (సిగరెట్ వెలిగిస్తూ గోపయ్యకు కనబడకుండా టోపా గుమస్తాకు సైగజేయును.)

టో పా:- ఇదుగో ఏమయ్యోయ్! ఇటురా! (గోపయ్యతో గూడా ముందుకువచ్చును.)
(టోపాదుగుమస్తా, గోపయ్య. ముందుకురాగానే సబ్ డివిజనల్ ఆఫీసరుకు వీరికి మధ్యగా తెరపడును.)

టోపా:- మీగ్రామం తరఫునతక్కిన వందరూపాయలు చెల్లించారా?

గోప:- ఇంకా మాగ్రామంలో వసూలు కాలేదండి.

టోపా:- వసూలుకాందె వట్టిచేతులతో ఏంజెయ్యొచ్చావయ్యా?

గోప:- పైర్లు ఎండి పోతున్నయ్యండి. పాపదలకు నీళ్ళు వదలక పోతే పాడై పోతయ్యని వచ్చానండి.

టోపా:- అట్లయితే ముందునీవు ఆఫీసరు గారికి వందరూపాయలిచ్చి తర్వాత వూళ్ళోచల్లగా వసూలు జేసుకో.

గోప:- నేనంతయిచ్చుకో లేనండి. పేదరైతును.

టోపా:- ఇచ్చుకో లేనివాడివి ఇక్కడి కెందుకొచ్చావయ్యా? పైసాపడితేనే గాని పాపుదలకు ఆర్డరివ్వరు.

గోప:- (ఆలోచించి) ఈపాతిక రూపాయలు ప్రస్తుతం తీసుకోమని చెప్పండి.

టోపా:- పాతికా? పాతికరూపాయలు తీసుకోటం వారి పద్దులోనే లేదే.

గోప:- ఇవ్వలేనండి. పేదవాణ్ణి.

టోపా:- ఆమాత్రమైనా యివ్వకబోతే ఆఫీసరుగారు వప్పుకోరయ్యా?

గోప:- (మళ్లీ ఆలోచించి జేబులోనుంచితీసి) సరే ఈయాభై రూపాయలిచ్చిపారుదలకునీళ్లు వదలిపెట్టించమని చెప్పండి.

టోపా:- ప్రయత్నంజేసిచూస్తాను. (లోపలకు వెళ్లికొంతసేప టికితిరిగివచ్చి) నేంజెప్ప లేదుటయ్యా! యాభై రూపాయలు తీసుకోటానికి యెంతమాత్రం అంగీకరించలేదు సరిగదా, పచ్చనోటుకు పైసా తగ్గకుండాయిస్తే సేపారుదలకు ఫర్మానా జారీచెయ్యటం, అన్నారు.

గోప:- అయ్యా! కామందులవార్ని కనికరించమని చెప్పండి.

టోపా:- చెప్పాను. ఈనక్కినినయాలు నాదగ్గరేమీ పనికి రావంటూ నన్నుగూడా అనవసరంగా మాట్లాడక అవతలికి పొమ్మన్నారు.

గోప:- అయ్యా ! ఇప్పుడింతవరకు తీసుకుంటే తక్కినవి వసూలు కాగానే తర్వాత పంపిస్తానని చెప్పండి.

టోపా:- అన్నీ చెప్పానయ్యా! నీకొక్కడికి నీళ్ళు విడిచిపెట్టిస్తే నీప్రక్కవాళ్లు ఊరుకుంటారు ? వాళ్ళుకూడానీళ్ళుపెట్టుకొని వట్టిచేతులు చూపిస్తారని అంతాయిస్తేగాని ఆర్డరివ్వనన్నారు.

గోప:- వందరూపాయలూ ఇవ్వాలిసిందేనా ?

టోపా:- ఒక్కకానీ తక్కువైనా ఒప్పుకోనన్నారు.

గోప:- (విసుగుతో జేబులోనుంచి తీసి) సరే, తీసుకొని గట్టిగా మాత్రం కాలవకు నీళ్ళు విడిచిపెట్టించమని చెప్పండి.

టోపా:- (తీసుకుంటూ) ఇక్కడే వుండండి, ఇచ్చివస్తాను. (లోపలికి పోవును.)

గోప:- అయ్యోయ్యో! మళ్లీ అప్పుదెచ్చిన మూడువందలలో ఒక వంద లంచంకింద యెగిరిపోయిందే! ఈ సబ్ డివిజనాఫీసరుకు లంచాలు గట్టలేక ఎంతమంది రైతులు నాశనమవుతున్నారో గదా. లంచాల పిశాచం ఆవేశించిన ఈ దుర్మార్గుల దావాగ్నికి తట్టుకోలేక ఎన్ని రైతుల సంసారాలు దగ్ధమవుతున్నవో గదా. లంచమిస్తూ కూడా లొంగిమాట్లాడటం. ఎంత విపరీతం, ఎంత అన్యాయం?

టోపా:- (వచ్చి చేతులు నలుపుకొంటూ నసుగుతూ) ఏమండోయ్ గోపయ్యగారూ! ఏమిటి ఆలోచిస్తున్నారు? వారిది వారికిచ్చారనుకోండి. మరి మాసపది రూపాయల మాట మరిచిపోయినారా యేమిటి?

మైల్:- (తెరకు రెండవప్రక్కగా వచ్చి చేతులు నలుపుకొంటూ) కుప్పకట్టలకు యెప్పుడు రమ్మంటారు?

టోపా:- కందులబస్తా కాస్త పంపుతారుగదూ!

మైల్:- కట్టెను పసుపువిత్తనమేనండి. కాస్త జ్ఞాపకం ఉంచుకోండి.

టోపా:- వేరుశనగ కాయలు తిని మొన్నాళ్లో అయిందండీ.

మైల్:- చెరుకుగడలకు చేనుదగ్గరకు రమ్మంటారా?

టోపా:- కంద మీ చేలోది మహా కమ్మగా ఉంటుంది లే!

మైల్:- మొక్కజొన్న కండెలకు మొహం వాచిపోయానండి

టోపా:- పెండలం ఈమధ్య పెదిమకే తగలలేదండి.
మైల్;- గోగునారకు కొంచెం వుండిరానా?
గోప:- (కోపంతో అటూ ఇటూ చుర చుర చూస్తూ) ఛీ ఛీ. కనికరం లేకుండా ప్రజలను పీల్చే కటిక దుర్మార్గులు. పైసాలంచానికిగూడా పీడించే పరమ కిరాతులు వీళ్లు. (చర చరా పోవును.)
టోపా:- (వెళ్లిపోతున్న గోపయ్యవెనకాల చూస్తూ, నిన్నేం జేస్తానో, అన్నట్లు వేలుచూపించును.)
మైల్:- (టోపా గుమాస్తా మాదిరిగానే గడ్డంలిచూపును)

(తెర పడును.)

# 5 వ రంగం

(కమల పూలతోటలో పూలుకోసి పూలబుట్టలో వేసుకొని కొన్ని తలలో పెట్టుకొంటూ అటూ ఇటూ హుషారుగా తిరుగుతూ చెట్టుమీదనున్న పక్షికూత విని తన్ను ఆ పక్షి ఎగతాళి చేస్తున్నదని ఉద్దేశ్యముతో డ్యాన్సింగ్ లాగా ఎగురుతూ కీర్తన పాడును.)

డ్యాన్సింగ్ సాంగ్-శివరంజని-త్రిశ్రగతి.

(ద్రోహి సినిమాలో లక్ష్మీరాజ్యం పాడిన ఓహోరోజా, అనుమాదిరి)

లలలల లలలల లలలా-లలలల లలలల లలలా॥

ఓ మయూరమా - వయారమా -అహో వినోదమా

గంతు లేల వంతమదేలా॥ పింఛముపై-చంచలమా॥

లలలల లలలల లలలా-లలలల లలలల లలలా॥

కన్నుల గర్వమేలా- నన్గని నవ్వనేలా॥

నీలిమబ్బులన్ గని నిక్కెదవేలా

కమలా ప్రసూనాడా- నీ -గర్వమణగదా

లలలా లలలా లలలా

ఎల్లకాల మీలీల

నీలిమబ్బులిటే - నిల్చియుండునటే॥

లలలల లలలల లలలా - లలలల లలలల లలలా-లలలలా

(కమల పాటపాడి ఇంటికి పోబోతూ ఎదురుగావచ్చే వీరన్నను చూచినిలబడిపోతుంది)

వీర:- (తలవంచుకొని పాటపాడుతూ తోటవైపుకు వస్తాడు)

పాట:- పెళ్లికొడుకులా జాబితాలో నేనున్నానో మరిలేనో॥

(అని పాడుకొంటూ వచ్చి లాభం లేదన్నట్లు తల తో మెల్లగా కొట్టుకొని జేబులోనున్న పీలసిండి నోట్లో పోసుకొంటూ తలెత్తి అకస్మాత్తుగా కమలను చూసి)

వీర;- ఓ, కవలీదేవుందే? తోటలో పూలకోసం వచ్చా వేుం? (కమల చేతిలో పూలబుట్ట చూసి) ఒక్క పువ్వు తీసుకుంటేదా? (అని చెయ్యిజాపును.)

కమ;- (పూలబుట్ట వెనక్కు లాక్కొని) అంటుకోబోక! ఆ నలుపంటుతుంది పూలకు,

వీర;- అదుగో! నల్లటోడు, నల్లటోడు, అనినన్ను మాయగ తాలి సేత్తుండావ్? నల్లకుక్కకున్నరోసం తెల్లకుక్క కున్నదా అంట.

కమ;- రోషంవుందో లేదోగాని నీ వేషంమాత్రంఅంతే. (వెక్కి రించును.)

వీర:- అబ్బో? అబ్బో? ఆ యెక్కిరింతుంటే అందంగా, పందంగా అచ్చు ఆడపిల్లలా గుండావ్ కవలా! అదిగో! అటునూశావా? (చూపిస్తూ)

కీర్తన – డైలాగ్ – వీరన్న – కమల

(కీలుగుర్రం సినిమాలో రేలంగి-కనకం పాడిన చెంపచేసి నాకింపుజేసితివి అను కీర్తన ననుసరించి)

వీర:- తోటలో యేసిన-దిట్టిబొమ్మలా-నీటుగుంటివే పిల్లా- బల్ నీటు!

కమ;- కట్టిపెట్టుయిూ-వాగుడింకనీ-దిష్టికొట్టు నేమో – ఛీఛీ!

వీర:- సురసురామంటానె - కరవొత్తాయేంచె- వరసవోన్నే గందెపిల్లా - నీకుచరచసే తెలదేటె పిల్లా॥

కమ:- నీ-మాటపరసము మాని-తోటలోకొచ్చిన-బాట నీ తిరిగి పోపామ్మా॥

వీర;- నల్లటోణ్ణని నన్ను-ఒల్లనంటావేంటె- పెల్లిసేసుకోయె పిల్లా-నన్ను పెల్లి॥

కమ;- చాలుచాలు పొమ్మా- నీ - జాడతెలిసెలెమ్మా-నీ కారుకూతలు కట్టిపెట్టి - దారికడ్డము లేలే॥ (అని కమల పోబోవ వీరన్న చేతులడ్డముపెట్టి)

వీర;- పారిపోదమనిసూత్తే-దారిలేదేపిల్లా-నక్ పెల్లిసేసుకుంటానంటె-యెల్లనిత్తాపిల్లా॥

కమ;- లేలే

వీర;- ఊహూ

(ఇంతటితో డైలాగ్ పూర్తియగును.)

కమ;- (కోపం, విసుగుతో) అయితేనన్ను పోనివ్వవా యేమిటి ?

వీర;- ఊహూ, ఆకూత్తెముక్క అంటేపోనిత్తా. (అని సగర్వంగా జేబులో పేలపిండి నోట్లో పోసికొనును.)

కమ;- (పేలపిండినిచూచి ఆలోచించి తప్పించుకు పోవాలని ఉద్దేశ్యంతో) అయితే వీరన్నా ! ఆముక్క అనాలిసిందేనా ?

వీర;- అంటే, నీ పల్లెం రాల్తాయి కవలా !

కమ:- మరి పెళ్ళిమీద ప్రేమగలవాడివైతే పేలపిండి యెప్పుడైనా పెట్టా?

వీర:- ఆ! పేలపిండి బెడితే ఆముక్క పెడేల్నెత్తా వన్నమాటేనా? అయితేపట్టు, ఆల్స్యం దేనికి? (పేలపిండిపెట్టును)

కమ:- (వీరన్న చేతులు తాకకుండా తనచేతిలో పెట్టించుకొని) ఇదిగో! యిదేమిటి? దీనినిండా యిన్ని చీమలున్నయ్?

వీర:- (దగ్గరకొచ్చిచూచి) ఏయీసీవలు? యీడా అవుపడకపోతే?

కమ:- కారునలువుకుతోడు కళ్ళమసక గూడా వుందన్నమాట. కళ్లు పెద్దవిజేసిచూడు.

వీర:- (చేతులతో కళ్ళు వగలదీసి పెద్దవిజేసిచూస్తాడు.)

కమ:- (ఊఫ్, అని పేలపిండంతా వీరన్న కళ్ళనిండా ఊది కిల కిలా నవ్వుతూ పారిపోతుంది.)

వీర:- (కోతిలాగాయీక్ష జేస్తూ కళ్ళు తుడుచుకొని) అరిదీని తస్సాదియ్యా? ఎంతపాసికేసిందిరా? నా పేల పిండి నాకళ్లల్లోనే గొట్టిపారిపోయింది, (ఆలోచించి) అయినాదీన్నడిగేదేంది?దురగమ్మత్త గనక 'ఊ' అంటా, యివాకం రేపు యీపాటికి అయిపోదూ? (వెళ్ళును.)

(తెరయెత్తగానే)

(దుర్గమ్మ రాట్నం త్రిప్పుతూ ఆలోచిస్తూ వుండును.)

వీర:- (ప్రవేశించి) అత్తేదో ఆలోచనలో పడ్డట్టుండదే!

మాౘేడికెల్లాడత్తా!

దుర్గ:- నీకు తెలీకుండావుంటుందిట్రా అల్లుడా! అమ్మాయి సంబంధాలకోసం అన్నం నీళ్ళు లేకుండా తిరుగుతున్నారు.

వీర:- ఎందుకత్తా! అన్నంనీల్లూ లేకుండా అంతకట్టపడి తిరగటం? యేదో ఒక సమందానికిచ్చి ఒువాకంసెయ్యక?

దుర్గ:- యేదో సంబంధానికి యెట్లా యిస్తాంరా, చూస్తూ చూస్తూ పిల్లను. సరైన సంబంధంరావొద్దూ?

వీర:- సరైన సమందమంటే యేంటత్తా!

దుర్గ:- యేదోయింతచదువు, చక్కదనం ఈడూ జోడూ వుండాలి గదా?

వీర:- అబ్బో! సాలాదాకావుందే కోరిక! సదువు, సక్కదనం గల్ల సమందాలురావాలంటే సవగ్గాదొరుకుతయ్యా అత్తా! సాలా సాలా కట్నాలివ్వాలి. అదీగాక సదువు సదువన్నమాటేగాని సదూకునోడికంటే సాకలోడే మేలని సామితే వుందిగందా. ఇహ అందమంటావా? అడుక్కుతింటానికిగూడా పనికిరాదని మాఅమ్మఅత్త మానం అంటావుంటది. యేదోయింతకలిగినసమందం సూసి ఆకాత్తైముడి యేయించత్తా!

దుర్గ:- కలిగిన సంబంధం వస్తేమాత్రం కట్నాలివ్వక తప్పేదేమిటా ?

వీర:- ఎందుకుతప్పదత్తా! యేందో మీారు యాడో సమందాల
కోసం యేల్లూ, కాల్లూ కొట్టుకొని తిరగటమే గాని
యింటిపక్క నేనుండగా యాడికో బోయి యెతకటం
దేనికత్తా! నల్లటోణ్ణన్నమాటేగాని నాకేంతక్కువ
సెప్పు. అయిదేళ్ళ్యా లోనికిపోయే అయ్యేజొత్తుంది
గందా. యిందాక మావతోటి గూడా యీామాటే
సెప్పాను. కట్టాలు, గిట్టాలు, కావాలన్నగందా.
అయినోడికి ఆమాత్రం పిల్లనియ్యగూడదా అత్తా?

దుర్గ:- ఇవ్వగూడకేంరా! చక్కదనంలేకపోయినా చదువైనా
ఉంటే నీ సంబంధం జేసేవాళ్ళమే.

వీర:- ఓస్, ఆమాత్రం నేనూ సదూకున్నాలే అత్తా!
అంతసవటదద్దమ్మను గాదులే.

దుర్గ:- ఎప్పుడు చదువుకున్నావురా!

వీర:- సమచ్చరం కిందట మాఅప్పన్నసమందాలకోసమన్నా
సదూకోరా అని పచ్చేగోలపెట్టేటలికి సందులోపంతు
లుకాడ సాలుకు రెండురూపాయలిత్తాననిసదూమొద
లేశాను. సదూసెప్పేసంతసేపూ సచ్చేదెబ్బలు కొడు
తూనే వుండేవోడాపంతులు.

దుర్గ:- అయితే బాగానే చదివావన్నమాట?

వీర:- ఆ. సదవకేం? కూడికలు, గుడింతాలు, అన్నీసెప్పే
వోడాపంతులు.

దుర్గ:- ఇంతకీనీకేమైనా వచ్చినయ్యా కూడికలు, గుడింతాలు?

వీర:- వచ్చినయ్యో, రాలేదో, యేడాదికిందటి సంగతి,

యేంగాపకంఉంటుందత్తా? అప్పుడుమామామంతుల నేవోడు ఒకే యిారన్నా! ఉత్తరాలు, పత్తరాలు నదివేదాకా వచ్చిందిరా నీకు సదువు, అనేవోడు.

దుర్గ:- ఉత్తరాలు, పత్రాలూ గూడా చదువుతావుట్రా ?

వీర:- ఆ, సదవ కేవత్తా! అంతసన్నాసోణ్ణిగాదు లే.

(తెరలో) ఎవరండీ ? ఉత్తరం వచ్చింది.

దుర్గ:- అల్లుడా ! కాస్త ఆవుత్తరం అందుకో.

వీర:- (ఉత్తరంతెచ్చి) దీని తస్సాదియ్యా ! సమయానికే వచ్చిందీవుత్తరం. నేసదువుతానూసుకో ! (కూర్చొని చూసిచూసి యేడ్చును.)

దుర్గ:-ఎందుకురాయేడుస్తావు?ఎక్కడనుంచివచ్చిందావుత్తరం?

వీర:- యేంజెప్పనత్తా? (యేడ్చును.)

దుర్గ:- (ఆదుర్దాతో వీరన్నదగ్గరకొచ్చి) యేడవటం దేనికిరా! ఏముందావుత్తరంలో. ఏదీయిటుతే. (తీసుకొనబోవును.)

వీర:- (ఉత్తరం యివ్వకుండా నెత్తికొట్టుకుంటూ) ఇంకా యేముందత్తా ! ఉత్తరంజూత్తే నే యేడవొత్తున్నదత్తా! (యేడ్చును.)

కమ:- (లోపలనుంచిఆదుర్దాతోవచ్చి) ఎందుకేఅమ్మావీరన్న యేడుస్తాడు?

దుర్గ:- ఏమిటోనమ్మా. ఎక్కడనుంచో వుత్తరం వచ్చింది. అది చూసి యేడుస్తున్నాడు. ఏమిట్రాఅంటేచెప్పడు. ఉత్తరం చూపించడు.

కమ:— (వీరన్న దగ్గరకెళ్ళి) ఏది వీరన్నా ఉత్తరం ? ఏముందం దులో. యేడుస్తావు దేనికి ?

వీర:— (ఉత్తరం జూసుకొంటూ మాట్లాడకుండా యేడ్చును.)

గోప:— (ప్రవేశించి ఆశ్చర్యంతో) ఏమిటిది? ఎందుకేడుస్తాడు వీరన్న ? ఏంజరిగింది ?

కమ:— ఎక్కడనుంచో వుత్తరంవస్తే అదిచూచి యేడుస్తున్నాడు నాన్నా! ఉత్తరం యివ్వమంటే యివ్వడు. ఏమిటో చెప్పడు.

గోప:— (వీరన్నదగ్గరకెళ్ళి) ఏమిట్రా వీరన్నా! ఎందుకుయేడవటం ?

వీర:— (ఉత్తరం జూస్తూ) ఏం సేప్పేదిమావా ! (యేడ్చును)

గోప:— ఏదా వుత్తరం ? (వీరన్న చేతులోనించి లాక్కొని చదివి) బాగా నేవుందే వుత్తరంలో. వేణు రాశాడు.

దుర్గ:— మన వేణు రాశాడా ?

గోప:— అవును అబ్బాయే. కులాసాగా వున్నానని రాశాడు. వీరన్న యేడవటం దేనికి.

దుర్గ:— ఏమో యెందుకో ఏమీమాట్లాడకపోతే నేనేంజెప్పేది.

గోప:— ఎందుకురా యేడవటం వీరన్నా! ఉత్తరంలో బాగానే వుందే?

వీర:— (యేడుస్తూనే) యేంసెప్పేది మావా ! నేనదూకొనే రోజుల్లో సిన్నగుమ్మడికాయంతఉండే అచ్చరాలుయీ వుత్తరంలో సీమతలకాయంతగానిక్కిపోయినయ్‌గందా.

ఇప్పుడేయింత సిక్కిపోతే యింక ముందెంత సిక్కిపోతయ్యోనని పానం ఉండ బట్టక బావురుమని యేడుత్తుండాను మావా! (యేడ్చును)

గోప:— (చిరాకుతో) ఛీ, యేడవబోక, నీతెలివి తెల్లవారినట్టే ఉంది.

దుర్గ:— 'నీచదువు చట్టుబండలుగాను, చాల్లేపద' పంతోషించాంలే నీ తెలివికి.

కమ:— యీ బుద్ధవిదున్నకు అతురాలుగూడావచ్చా?

వీర:— (లేస్తూ) అందరికీ కోపవొచ్చినట్టుండే దేనామీాన, అట్టయితే యెల్లి ఆనికొత్తాలే. (పోవును.)

దుర్గ:— పిల్లనివ్వాలిట పిల్లను. యింత తెలివితేటల్లుగల అల్లుడు ద్దొరకడని.

గోప:— నిన్నుగూడా అడిగాడా యేం?

దుర్గ:— అందుకొచ్చిన యేడుపే యిదంతా. మిమ్మల్ని గూడా అడిగాడటగా?

గోప:— ఆ. అడిగాడు ప్రొద్దున. కాని ఈవిషయంలో అందరికంటే వాడేనయంగావున్నాడు. కట్నాలు, కానుకలు కావాలని గొంతెమ్మ కోరికలు కోరకుండా.

దుర్గ:— ఏమయిందండీ, మీారు వెళ్ళినపని?

గోప:— ఏమవుతుందే? ఏసంబంధం చూడబోయినా కట్నమెంతయిస్తావని కన్నెగరేసేవాళ్ళేగాని అమ్మాయి చదువు, చక్కదనంసంగతి అడిగేవాడేలేకపోతే?

గీ. పిండిబొమ్మకు సైతము పిల్లనిత్తు
మంచనిన చాచుచేయి పెండ్లిలందమంచు
చాలకది గూడ వందలు వేలమించి
యెకరముల లెక్కలోబడె యెంచిచూడ

దుర్గ:- అయితే వందలుగావు, వేలుగావు, యెకరాలుటండీ కట్నం? ఇదేమన్యాయమండీ? అదీగాక ఇరుగుపొరు గమ్మలక్క లందరూ

గీ. కూతు పెడ్లియెపుడు సేతువమ్మాయన
చెప్పలేక సిగ్గుజెందుచుంటి
ఇంట నెన్నినాళ్ళు ఈడువచ్చినపిల్ల
నట్టెపెట్టుకొందు మరసి చూడ

గోప:- ఏంజెయ్యమంటావే? తిరిగి తిరిగి కాళ్ళరిగిపోతున్నయ్ గాని ముచ్చటగా ఒక్క సంబంధమైనా ముడిపడితేనా? ఆఖరికి యీ వీరన్నకే యిచ్చి వివాహం జేస్తేనే బాగుండు నేమోనన్నంత విసుగుగూడా పుడుతున్నది.

దుర్గ:- వీరన్న కివ్వటమా? వింతగా మాట్లాడుతున్నారేమండీ యివ్వాళ? కాకిముక్కుకు దొండపండా? అమ్మాయి ఒప్పుకొంటుందనేనా మీ అభిప్రాయం?

గోప:- అంతకంటే చేసేదేమీ లేనప్పుడు అభిప్రాయాలుగూడా మార్చుకోవాలి, తాహతు కనిపెట్టి తగినట్టు ప్రవర్తించాలంటావా లేదా? అనవసరమైన ఆలోచనలు పెట్టుకోక అమ్మాయికి నచ్చజెప్పు.

దుర్గ;- ఎదురుగానే వుందిగా అమ్మాయి. ఏంవచ్చెనో చెప్తారేమో
మీరే చెప్పండి.

కమ; (కళ్ళవెంట నీళ్ళు కారుస్తూ వుండును.)

గోప:- (చూచి) అమ్మా, కమలా ! (అని దగ్గరకు పోయి
కమల కళ్ళనీళ్లు తుడుచును.)

కమ;- (దుఃఖంతో) వివాహం జేసుకోకుండా ఇట్లాగే కన్యగా
వుండగూడదా నాన్నా ?

గోప;- అమ్మా! కమలా ! ఆడపిల్లలను కనటమే పెద్దఅపరా
ధం చేసినట్లుగా వుంది. ఇక వివాహం జెయ్యకుండా
వుంటే యీలోకంలో బ్రతుకనిస్తారా అమ్మా ! మన
స్సులో ఏమీ పెట్టుకోక మేంజెప్పినట్లువిను. ఎండలో
తిరిగి తిరిగివచ్చాను, కాసినివేన్నీళ్ళు పెట్టమ్మాపోయి.

కమ;- (దిగులుతో లోపలికిపోవును.)

దుర్గ:- అబ్బాయికి తెలిస్తే అసలు ఒప్పుకోడండి. అమ్మాయిని
శాస్త్రో కూస్త్రో చదివించి ఆఖరికి చదువు, చట్టుబండలు
లేకుండా ఎవరికీ యిష్టంలేని వీరన్నకిస్తానంటారేమండీ?
ఉత్తరం తీసుకు చదువుతానని యేదుస్తూ కూచున్నా
డా యేదీ? మరచిపోయినా. ఇంతకీ ఆవుత్తరం
చూడనే లేదుగా ? అబ్బాయి యేంరాశాడో చదవ
వండి.

గోప:- (ఉత్తరం తనలో చదివి) యేంరాశాడు? పరీక్ష ఫీజుకు
హాస్టల్ ఖర్చులకు వగైరాలకు మొన్న మనియార్డరు
చేసిన వందరూపాయలు ముట్టినట్లుగా రాశాడు.

దుర్గ:- అయితే మళ్ళీ తెచ్చిన మూడువందలూ అయిపోయి నట్లేనా ?

గోప;- అయిపోక యింకెక్కడున్నయ్? నీ చీరెలకు గాని, నా పంచలకుగాని అమ్మాయి బట్టలకుగాని, ఒక వంద అయిపోయినయ్యా?

దుర్గ:- అయితేమనబట్టలకువందరూపాయలు అయినయ్‌టండీ?

గోప:- కాకేముందే? ఎక్కడజూసినా బ్లాక్ మార్కెట్. ఏవికొనబోయినా విపరీత ధరలు. వస్తువనేది బయటే పెట్టరు యీవర్తకులు. మూడురోజులు తిరిగి బ్రతిమి లాడితే మూడురూపాయలు ఖరీదు చేసేచీరె ముప్ఫై రూపాయలకు వాడి కొంపమునిగి పోయినట్టు ముక్కుతూ, మూల్గుతూ యిచ్చాడు.

దుర్గ:- అమ్మో? ముప్ఫైరూపాయలే !

గోప:- మరేమనుకున్నావ్ ! కానీకి కక్కుర్తిబడ్డ కటిక దరిద్రులు గూడా యీరోజున కార్లలో తిరుగుతున్నా రంటే దానికి కారణమేమిటనుకున్నావ్ ?

గీ. బ్లాకు మార్కెటులోన లాభాలు దీయ
దినములెన్నియొ వరుసగా త్రిప్పి త్రిప్పి
ఎంద రెందరో పేదల నెత్తుటిపీల్చి
పిప్పి యొనరించి తమయాస్తి పెంచినారొ ;

దీనికే యిట్లాఅనుకుంటే ఆహార పదార్థాల ధరలు అంతులేకుండా పెరిగినై. అపైన కంట్రోళ్లు, రేషనిం

గులు. ఆవస్తువులు తెచ్చుకోవాలంటే లంచం. పట్టు కుంటే లంచం. పర్మిషన్‌కి లంచం. అబ్బబ్బ. యీాలం చాల వల్ల, యీకంట్రోళ్ళు, రేషనింగుల వల్ల, యీ బ్లాక్‌మార్కెట్లవల్ల ఈరోజుల్లో బ్రతకటం మనబోటి మధ్యతరగతి వాళ్ళకు మహాకష్టంగా వుందే.

దుర్గ:- అయితే మూడువందల్లో మనబట్టలకు వంద, అబ్బా యికి పంపించిన వంద, రెండువందలు పోతే మిగిలిన వంద సబ్ డివిజనాఫీసర్‌తో సరిపోయిందన్నమాట.

గోప:- ఆ. సరిపోయింది.

దుర్గ:- అయ్యయ్యో! వందలకు వందలు టండీలంచం! సంసారమంతా చదికిలబడి పోతుంటే అప్పులు జేసి తక్కిసాలకింద తగలెయ్యటమా! ఇదెక్కడిఅన్యాయ మండీ?

గీ. మాటిమాటికి యీరీతి నోటుప్రాసి
వందలాదిగ లంచముల్ వారి కివ్వ
గవ్వలా? గచ్చకాయలా? త్రవ్వితీయ
అయ్యయో! కాపురంబడు గంటిపోదె?

గోప:- మరేంజెయ్యమంటావే? ఎక్కడికిపోయినా, ఎవడిని జూచినా, లంచం లంచం అనిదేబెరించేవాడేగాని రైతుల కష్టసుఖాలు విచారించే వాడే లేడు.

గీ. వంగి వంగి సలాములు వరుసనిడిన
బ్రతిమి లాడిన మరి యెంతో భంగపడిన
లక్షమాటలు చెప్పినా లంచమీక
పనియె జరుగదుగద యీ ప్రపంచకమున

అదీగాక వందలకు వందలు జీతాలు దీసుకొంటున్నా ఒక్క రూపాయైనా లంచం ముట్టితేగాని అన్నమే సయించదు యీ అధికార్లకు. ఇకలంచం రానినాడు లంఖణమే.

(అప్పడు ప్రవేశం.)

అప్ప:- ఏమండీ! జీతంలోవి రెండు రూపాయలుంచేయిచ్చారండీ. ఇంటో బొత్తిగా గింజలు లేవు.

గోప:- చేతిలో బొత్తిగా చిల్లి కానికూడా లేదురా.

అప్ప:- అవును లెండి. అదికోర్ల లంచాలకైతే వందలు వందలొత్తయ్ గాని జీతగోళ్లడిగితే సేతిలోనే వుండవు లేండి.

గోప:- ఆనకెక్కడైనా అప్పుదెచ్చి యిస్తాలేరా! సరేగాని చేనుకు నీళ్ళెక్కినయ్యా?

అప్ప:- ఏంకెల్లండి. మీరుసెప్పినట్టుగా అడ్డయేసి గండికొట్టి నిన్న రేతిరి నుంచి నిదరా ఆరాలు లేకుండా కంటో వత్తిబెట్టుకొని కాసుకు కూసున్నా కాలవలోకి కాసిని నీళ్లైనా వత్తేగా?

గోప:- (ఆశ్చర్యంగా) కాసినికూడా రాలేదురా నీళ్ళు? అయ్యయ్యో! చూస్తూ చూస్తూ వందరూపాయలు వాడి బొందమీద కొట్టివచ్చానే?

అప్ప:- అదిగాదుండీ! అక్కడుండ గుమాస్తాలు యేవో లంచాలడుగుతే మాట్టాడకుండా వచ్చారంటుగా? అందుకని ఆయనగోరు నీల్లు యిడిసిపెట్టమని సెప్పినా యీల్లు యిడిసిపెట్టకుండా మోసం సేత్తున్నారండీ.

గోప:- వీళ్ళ దుంపతెగ. దేముడు వరమిచ్చినా పూజారి వరమివ్వడన్నట్లు మనిషిమనిషికీ లంచమిచ్చి మనమెక్కడ బ్రతుకుతాంరా?

అప్ప:- ఏమోనండి. నిన్న పొద్దున తాసీల్దారుగోరు అటుపోతూ పోతూ మన గండీ సూసి రాసుకుపోయారు. (పోవుచు)

(తెరలో) ఎవరండీ యింట్లో, తాసీల్దారు గారు తాఖీదు పంపించారు.

గోప:- (తెచ్చుకొని చదివి ఆశ్చర్యంతో) ఆ? రెండువందల రూపాయలే?

దుర్గ:- ఏమిటండీ అది?

గోప:- ఇంకేముందే? కొంప మునిగింది. కాలవకు మాత్రం నీళ్ళు రాలేదుగాని గండీ కొట్టినందుకు అపరాధం క్రింద రెండువందల రూపాయలు వారంరోజుల్లో కట్టమని తాశీల్దారు గారు తాఖీదుపంపించారు, లేకపోతే ఉన్న ఆస్తి జప్తుచేసి వేలం వేస్తారుట.

దుర్గ:- (గుండెలు కొట్టుకుంటూ) అమ్మో! అమ్మో! రెండు వందల రూపాయలే! అపరాధం వేశారు? అయ్యయ్యో! ఆ గండీ కొట్టక పోయినా బ్రతికే వాళ్ళం గదండీ. ఎక్కడ తెచ్చి కడతామండీ రెండు

వందలు ? వెనకటి అప్పు అప్పుగానే వుంది. మళ్ళీ ఇదొకటి. అన్నికష్టాలూ ఇప్పుడే వచ్చినయ్యేమండీ ? ఇరుగు పొరుగు వాళ్ళ దగ్గర ఇదివరలో తెచ్చిన రెండు వందలూ ఇస్తామో, ఇవ్వమో, అని ఇంటిచుట్టూ రోజుకు ఇరవైసార్లైనా తిరిగి పోతున్నారు. ఇక చేబదుళ్ళ సంగతి చెప్పనే అక్కర్లేదుగదా. అన్నంనీళ్ళు గూడా సయించటంలేదు యీ అప్పులెట్లాతీరుతయ్యన్న ఆలోచనతో.

గోప:- అందుకే ఒక అరయకరమైనా అమ్మి అప్పులన్నీ తీరుద్దామనుకొంటున్నాను.

దుర్గ:- ఆపనైనా త్వరలో చేయండి. (పోవును.)

గోప:- (ఆలోచించు చుండును.)

(తెరపడును.)

ప్రథమాంకము సంపూర్ణము.

# ద్వితీయాంకము.

## 1 వ రంగము

(గోపయ్య గృహములోని ఒకగదిలో కమల ఒంటరిగా కూర్చొనియుండును)

కమల:— కీర్తన— (గృహప్రవేశం సినీమాలో భానుమతిపాడిన 'ఏమగునో' మాదిరి.)

(1) ఏమగునో—నాజీవితమిక
ఎటుజూచినా — నిరాశ — ఏదిదారి ॥ఏమ॥
(2) కట్నమివ్వలేక — తల్లిదండ్రులే కఠినులై
కన్యలజీవితమిటు — కడగండ్లపాలు జేతురా ॥ఏమ॥
(3) చదువురాని పశువుకివ్వ — సంబంధము గూర్చెతండ్రీ
ఎంత వేడినా—మనసు కరుగదాయే— మనసుకరుగదాయే
మదికితోచదాయే॥ఏమ॥
(4) పారిపోదమనితలచిన—పరువుపోవునని భయమున
మదికి నచ్చదీపనియిక — మరినాగతి యేమగునో ॥ఏమ॥

అయ్యయ్యో! ఈ కట్నాలివ్వనిదే కన్యలకు వివాహమేగాదా? ఈ మామూళ్ళివ్వనిదే మంగళ సూత్రమే కట్టరా? ఈలంచాలివ్వనిదే మంచిసంబంధమే రాదా?

గీ. కట్నమివ్వకున్న కన్యకెచ్చటగాని
వరుడు రాడ? పెండ్లి జరుగ బోద?
ఆడుజన్మ కంటె అడవిలో మ్రానుగా
మొలచుటరసిచూడ ముదముగాదె?

అయ్యయ్యో! ఈప్రపంచకంలో కట్నాలు, కట్నాలని కలవరించటంతప్ప కన్యలయొక్క చదువు,చక్కదనం అక్కరేలేదా? ఛీ ఛీ. ఈకట్నాలపెళ్ళి జేసుకోటంకంటే

గంగలో దూకటంమేలు. మా అమ్మా నాన్నా ఈ కట్నాలివ్వలేక కలిగిన సంబంధమనినన్నా వీరన్న కిచ్చి వివాహంజేయ నిశ్చయించారే? ఈనల్ల మొద్దును నాకంఠానికి ముడిబెట్ట దలిచారే? కనిపెంచిన తల్లి దండ్రులకు గూడా ఎంతకష్టమైపోయాను? పోనీ, యీ వివాహం తప్పించమని మాఅన్నయ్యకుఉత్తరంరా స్తే? (ఆలోచించి) ఏమీ లాభంలేదు. వాడి మాటగూడా ఆలకించ దీసమయంలో. ఆ? ఆనల్ల మొద్దుకన్న నాకిక దిక్కేలేదా ? ఆచదువురాని పశువుకన్న నాకు సం బంధమేరాదా ? ప్రపంచ జ్ఞానమేలేని ఆ వీరన్న నేనా పెళ్ళిజేసుకోటం ? మనసుకలియని దాంపత్యముంటుం దా ? ఎంత సరిపెట్టుకొందామన్నా వీరన్నను వివా హం జేసుకోటానికి నామనస్సెంతమాత్రం అంగీకరిం చటం లేదే. ఛీ. ఛీ, యీచదువురాని పశువును చేసు కోటం కంటే చావటంమేలు. మనసున కిష్టంలేని మను వును జేసుకోటం కంటే మరణించటమే మేలు. ఆ! ఆ! మరణించటమా ? అంతకన్న మార్గ మే లేదా ? ఆత్మహత్య తప్పని అన్ని శాస్త్రాలూ చెపుతున్నవంటారే, ఆ! ఆ! ఏమిటి ? ఎంతమతిలేని ఆలోచన చేస్తున్నాను ? చావటానికి సాహసించలేక

శాస్త్రిల వంకబెట్టి మనస్సును సరిపెట్టుకుంటున్నానా? అధిక కట్నాల కాసింపజేయగల యీ అవమానకరమైన అనుబొంది నింతటితో అంత మొందించ లేక అధోగతిలోకి పోవటానికి ఆలోచిస్తున్నానా? తాహతు లేని తల్లిదండ్రుల తలబరువు తీర్చటానికి నేనీమాత్రము త్యాగము చేయలేనా? మనసున కిష్టంగాని మనువును జేసుకోటంకంటే మరణించటం ఆత్మహత్య ఎలా అవుతుంది? కాదు కాదు. ఆత్మగౌరవము. ఈ నా ప్రాణార్పణతో ప్రపంచకాని కొక పాఠం నేర్పుతాను. ఈ కట్నాల పిశాచానికి బలిగా యిప్పుడే కాల్చుకుచచ్చిపోతాను. (అగ్గిపెట్టెతీసుకొచ్చి అగ్గిపుల్లతీసి పట్టుకొని) హా! లంచాల పిశాచమా! కట్నమనే పేరుతో కన్యల తలిదండ్రుల కాపరాలుగూల్చి ఎట్టి కడగండ్లపాలు జేస్తున్నావే? అధికారుల నావేశించి అందరినీ నాశనము జెయ్యటమే గాకుండా పెండ్లికొడుకులను గూడా ఆవేశించి పేదలరక్తం పీల్చుకుం త్రాగుతున్నావుగదే. ఓ కట్నాలడిగే కసాయిహృదయులారా! మీ కట్నాల దాహానికి బలిగా కాల్చుకుచచ్చిపోతున్న యీ కమలను జూచియైనా మీ మనసు కరుగదా? ఓ కాంగ్రెస్ మంత్రులారా! కన్యల జీవితాలను నాశనం జేసే ఈ కట్నాల పిశాచాన్ని కఠినమైన శాస

నాలతో కట్టుబాటుచేయలేరా? ఓతల్లిదండ్రులారా ! కమలఅనే కూతురు మీకడుపున పుట్టనేలేదనుకోండి. అన్నయ్యా ! మనసుకిష్టంలేని మనువును జేసుకోలేక మరణించుతూన్న నీచెల్లెల్ని మన్నించు. భారతమాతా! ఇవేనీకు నా ఆఖరినమస్కారాలు. హా! లంచాలపిశాచమా!
(అగ్గిపుల్లగీచి బట్టలకంటించుకొని కాలిచచ్చిపోవును)

(తెరపడును.)

# 2 వ రంగము

## షావుకారు పుల్లయ్య గృహము

(షావుకారు పుల్లయ్య చాపమీద కూర్చొని ఫౌంటెన్ పెన్‌తో ఖాతా పుస్తకాలపైన వ్రాసుకొంటూ వుంటాడు. మనిషి నలుపు. బొర్ర లావుగా వుంటుంది. చేతికి మురుగులు, అక్కడక్కడ చిరిగిన నల్లకోటు వుంటుంది.)

గోప:- (ప్రవేశించి) పుల్లయ్యగారేదో పనిమీద ఉన్నట్టున్నారే?

షావు:- (తలెత్తి చూచి) రావయ్యా, గోపయ్యబావా! కూర్చో.

గోప:- (చాపమీద కూర్చొని) ఏమిటండీ రాస్తున్నారు?

షావు:- ఆ, ఏముంటుందీ? వడ్డీ వ్యాపారం గందా, వాయిదా దగ్గరకొచ్చిన నోట్లేమన్నా ఉన్నయ్యేమోనని సూత్తుండాను. మళ్ళీ ఏదో బేరంమీదే వచ్చినట్టున్నావే, గోపయ్యబావా!

గోప:- అవునండీ, పుల్లయ్యగారూ! బేరంమీదే వచ్చాను.

షావు:- (తనలో) బేరంమీదగాక ఊరికే వత్తాడు? అసలు మనదగ్గర అప్పు దీసికెళ్లినోళ్లు ఆత్తులన్నీ మనకే అంటగట్టటం తప్ప అప్పుదీర్చటం అనేది లేదుగందా. (బిగ్గరగా) అయితే యేమాత్రం గావాలే?

గోప:- లేదండి, యీతడవ అప్పు జెయ్యదలచ లేదు. అప్పులన్నీ తీర్చటానికి ఒక అరయకరం అమ్మదామనుకున్నాను. మీరీమధ్య మాపొలందగ్గరకొచ్చి చూసి

వెళ్ళినట్టు తెలిసింది. మీ కేమైనా పొలం కొనుక్కునే
ఉద్దేశ్యమున్న దేమోనని చెప్పటానికి వచ్చాను.

పాపు:- (తనలో) ఏంటి? మనంపొలంవెళ్ళి చూసిందిమంచిదో
కాదో ఎంతవరకు అప్పుయిచ్చి యెట్టా ఆ పొలం
కలుపుకోవాలో, అని చూశాంగాని కొనుక్కుందమకా?
అదీగాక ఆ రెకరం అమ్ముతా నంటున్నా డేంటి?
అదివరకోళ్ళ మాదిరిగానే అప్పుడప్పుడు అప్పుదీసికెళ్ళి
ఆపొలంకాంతా మనకే అంటగడతాడనుకున్నా గాని
అప్పుడే ఆ రెకరం అమ్మి అప్పుదీరుంతాడనుకున్నానా?
ఆ. (ఆలోచించి) అయినా యీమాటని చూద్దాం.
అంతగా కావంటే అప్పుడాలోసించొచ్చు. (బిగ్గరగా)
సరేగాని గోపయ్యబావా! అప్పుడే యెందుకయ్యా,
ఆరెకరం అమ్మటం? నాకివ్వాల్సింది యెనిమిదొంద
లేగా? ఈ యేడు పంటతో నాబాకీ తీరిపోతుందా
యెను. కావాలంటే కొంతో కూంతో తీసికెళ్ళు,
కాతా తీసెయ్యటం శేనికయ్యా! చూత్తూ చూత్తూ
పొలం అమ్మటం, నాకు చుతరామూ యిట్టంలేదు.

గోప:- కాదండి. మరిరెండు వందలు గూడా నెత్తినపడ్డయ్.
పొరుగువాళ్ళ దగ్గర తెచ్చిన ప్రోనోటు బాకీ రెండు
వందలుగాక చేబదుళ్ళుగాదెచ్చిన చిల్లరబాకీలుగూడా
చాలావున్నై. అదీగాక మాయింటి ప్రక్కనున్న
వీరన్నకిచ్చి ఈ నెలలోనే మాఅమ్మాయికి వివాహం
చేదామని గూడా వున్నది. అందుకని అరయకరం

అమ్మదలచు కొన్నాను. ఇప్పుడున్న ధరల ప్రకారం ఏదో ఒకటి నిర్ణయించు కొందాం. మీరుకొనుక్కుంటే సరే, మీఅప్పు పోను మిగతా పైకమివ్వవచ్చు. లేకపోతే మరొకరికి అమ్ముతాను.

పాపు:- అదేంటీ? రెండొందలు నెత్తినపడ్డ వేంటీ?

గోప:- కాలవకు గండీ కొట్టినందుకు అపరాధంకింద రెండు వందలు నెత్తినవేశారు. పైగా వారంరోజులలో నేకట్టాలట. లేకపోతే ఉన్నఆస్తి జప్తుచేసి వేలంవేస్తారుట.

పాపు:- ఎందుకు కొట్టావయ్యా, గండీ?

గోప:- ఏంజెయ్యమంటారు? కొట్టకపోతే సీళ్ళేక్కవు, కొడితే అపరాధం. ముందుకు పోతే నుయ్యి, వెనక్కుపోతే గొయ్యి. లంచాలాసించి కాలవఅడుగున కాసినినీళ్ళు విడిచిపెడుతుంటారు. ఎంత సేపూ రైతులను పీక్కుతినేవాళ్ళే గాని మేలుజేసే వాళ్ళు ఒక్కళ్ళూ లేరు గదా. తాసిల్దారుగారుం చుకొన్న దగుల్బాజీముండ పుట్టినరోజు పండుగకుఅయన అర్జంటని కబురు చేయగా అప్పటి కప్పుడుఅప్పుజేసి ఖాఅప్పుడి నెత్తి మీదవేసి పంపిన ఐదుమానికల కందులలో అరగిద్దెడు తక్కువైనట్లు తనకు అనుమానం వేసిందిట, అందుకని కాళ్ళు పట్టుకున్నా వల్లగాదని జరిమానా రెండువందలు చచ్చినట్లు కట్టాలిసిందే నన్నాడు.

పాపు:- అయితే తాసీల్దారుగారి దగ్గరకు కూడా వెళ్ళివచ్చావన్నమాట.

గోప:- ఆ. వెళ్ళి బ్రతిమిలాడినా ఏమీ ప్రయోజనం లేకపోయింది.

పాపు:- అయితే నీ కారెండెకరాలేనా? ఇంకేవన్నా వుందా?

గోప:- అంతేనండి. ఆరెండెకరాలు గాక ఒకపూరిల్లుమాత్రం వుంది.

పాపు:- అట్టాగా. (తనలో) ఇక యేదో యెత్తెత్తకపోతే యేవీ లాభం లేదు. మనం కొనకపోతే మరొకళ్ళకైనా అమ్ముతాట్ట. అరెకరమే కలుపుకోటానికి నేనేం యెర్రిపుల్లయ్యనా? మొత్తం రెండెకరాలు కలుపుకోవాలిగాని. యినకోమాటు యెర్రెయ్యగారి పిచ్చయ్య ఇట్టాగే అంటే ఏంజేశాను? పైరివేట్ల బాపిరాజు చేతిలో పచ్చనోటొకటి పాలేసి ఆ ప్రోనోటు కాంతా పోర్జరీ సేయించి ఆడిపొలమంతా నాపాట్టన బెట్టుకున్నాను. ఇప్పుడు గూడా ఆపనే జేంతే యీడి రోగం ఒక్కఅన కుదురుద్ది. ఇప్పుడు రెండెకరాలుక నీసం రెండునాలుగులు ఎనిమి దేలైనా చేంతయ్. యీడి వ్వాల్చిన బాకీ యెనిమిదొందలకు గాను యెనిమిదేల రూపాయలుగా పోర్జరీసేయించి ఆ ప్రోనోటు యీరోజునే కోరట్లో దాకల్ జేసి ఆరెండెకరాలు సోదీనపర్సుకుంటా. పై వొడ్డీకిగాని, కర్సులకుగాని పంటుందిగందా. యీడుబాకీ వున్న యిరుగు పొరుగోళ్ళను గూడా యిప్పుడే రేగగొడతాను. ఇక యీ నాలుగొందలు యీడెక్కడనుంచి తెచ్చికడతాడు?

ఎటుతిరిగి మిగిలినఆత్తి ఆయిల్లు. ఆయిల్లుజపుతుసేసి యేలంయేయక తప్పదు.ఆయేలంలో మనమే ఆయిల్లు గూడ సరకారు గుమాంతా సాటు ముడుపు సెల్లించి సాలీసుగా పాడుకోవొచ్చు.అంతగా యెవడైనా అడ్డం వంతే, అరదో పావలో, తగలేంతేసరి, అంకౌటితో ఆడేపోతాడు. ఇంకీ దెబ్బతో గోపయ్య కొండెక్కా డన్నమాటే!

గోప:- ఏమిటండీ, ఏదో ఆలోచిస్తున్నారు. ధరలసంగతా?

పావు:- (నంగిమాటలతో) కాదయ్యా, సీవియ్యాల్సిన యెనిమిదేలకూ వొడ్డీయేమాతరం అన్నద్దా, అని

గోప:- (ఆశ్చర్యంతో)ఎనిమిదివేలేమిటండీ?ఎనిమిదివందలేగా?

పావు:- (పుస్తకాలు సద్దుకుంటూ) ఆ? ఆ? యామన్నావు? యెనిమిదొందలా ? యెనిమిదేలప్పు సేసికెళ్ళి యెనిమి దొందలంటున్నావూ? ఏం పెద్దమనిసివయ్యా?

గోప:- ఇంతకుముందేగదండీ, మీరుగూడా ఎనిమిది వంద లన్నది. ఇంతలోకే అబద్ధాలాడతారేమండీ?

పావు:- (పుస్తకాలుచంకన బెట్టుకొని ఒక్కొక్క అడుగు వెనక్కు వేస్తూ) ఏంటీ? అబద్ధాలాడుతున్నాను? అబ ద్దాలుసీవాడతావ్ నీతండ్రిఆడతాడు,నీతాతఆడతాడు.

గోప:- (లేచికోపంతో) ఏమయ్యోయ్! మాటలుమాత్రం మర్యాదగారానీయ్. నీమోసం అర్థమయిందిలే. మా కాలం వచ్చిచూసిందిఇందుకా? ప్రోనోటు ఫోర్జరీచేసి దొంగరాతరాయించావా ?

షావు:- (వెనక్కు తగ్గుతూనే) దొంగదొంగన్నావంటే మరే దడక్కడు. ఎవడు సేశాడు ఫోర్జరీ. కోర్టులో దాకల్ జేంతే అన్ని తేల్తయ్.

గోప:- ఈవిధంగా మా ఆస్తులు వేసుకొని తిందామనుకున్నావుటయ్యా? మాకడుపు గొట్టి నాశనం అయిపోవుటయ్యా? మావుసురుతగిలి చావవుటయ్యా?

షావు:- (వెనక్కు తగ్గుతూనే) నువ్వు చస్తావ్. నీపెళ్ళాంబిడ్డలు చస్తారు. నీవోళ్లంతా చస్తారు. సీతారత్తం! ఒరే పెద్దబ్బాయ్! రాండిరా! రాండిరా!

గోప:- ఓరినీదుంప తెగ. ఇట్లా యెంతమందికొంపలుతీశావురా!

సావు:- (వెనక్కు తలుపువరకూపోయి) జాగర్తగా మాట్లాడు. పెద్దనుడుసుల సేత బుద్దిసెప్పింతాను. (అంటూలోనికి పోయి గభాలున తలుపువేసి గడియబిగించుకొనును.)

గోప:- (తలుపుదగ్గరకు పోయి కోపంతో తలుపు గుంజుతూ తట్టుతూ,) తలుపు వేసుకొంటావేంరా! బుద్ధిచెప్పిద్దువుగానిరా బయటికి? రావేంరా! (కొంతసేపుగుంజి వెనక్కుతిరిగిఆలోచిస్తూ) అరెరే? ఎంతకుట్రచేశాడురా వీడు. ఆస్తంతా వేసుకు తిందామని ఎంత పన్నాగం బన్నాడురా? ఎంతమోసంజరిగింది? ఎంతమోసంజరిగింది? (తలపట్టుకొని విచారంతో) అయ్యయ్యో! అపరాధం రెండువందలు, అప్పాలు రెండువందలు యిప్పుడు యెక్కడ తీసుకొచ్చికట్టను? ఛీ, ఛీ. ఈపాడులోకంలో

ఎక్కడజూసినా మోసం. ఎక్కడజూసినాకుట్ర.ఎక్కడ
జూసినా ఆశ. ఎక్కడజూసినా లంచం.

గీ:- సందు సందుల వంకెల పొందుపరచి
ఘోర్జరీచేసి నాకొంపముంపజూచె
దైవమా! యెట్టికాలంబు దాపురించె
యేమిసేయుదు నిపుడు నాకేదిదారి?

(ఆవేదనగా రెండుచేతులతో జుట్టు పీకుకొనును.)
అప్పడు పరుగెత్తుకుంటూవచ్చి)

అప్ప:- (రొప్పుతూ) ఏంముండోయ్! మీఅమ్మాయి....
వల్లుకాలుసుకుసచ్చిపోయింది.

గోప:- (దుఃఖంతో) ఆ? ఆ? మాఅమ్మాయా? కమలేనా?
కాల్చుకు చచ్చిపోయిందా? కమలా! కమలా! (అప్ప
డితోగూడా వెంటనే ఆదూర్దాతో వెళ్ళును.)

(తెరపడును)

# 3 వ రంగము

(దయాల్ పురం ధర్మాసుపత్రిలో ఒకటే రకం ఫుల్ సూట్ తో డాక్టరు కుర్చీమీద కూర్చొని సిరంజికి సూది తగిలించిస్పిరిట్ లాగి వదులు తూంటాడు. మెల్లో స్టెతస్కోపువుంటుంది. ఎదురుగా డ్రాయరు. ప్రక్కగా నిల్చొని దుర్గమ్మ డాక్టరును బ్రతిమిలాడుతూ వుంటుంది.)

దుర్గ;- అయ్యా, అయ్యా ! డాక్టరుగారూ ! మావారుచాలా జబ్బుగావున్నారండి. అస్పత్రిలో జేర్చుకోండితండ్రీ!

డాక్టర్:- ఏంలాభంలేదమ్మా! ఇక్కడ గదులు ఖాళీలేవు. రోగిని మీయింటిదగ్గరే వుంచి రోజూవచ్చి మందు తీసుకొని పోతూవుండు.

దుర్గ;- అయ్యో, అయ్యో. మాకుయిల్లుగూడా లేదండి. తాసీల్దారుగారు ఇల్లు జప్తుచేసి యింట్లో నుంచి వెళ్ళగొట్టారు, ఒక చెట్టుకింద ఉంటున్నాంతండ్రీ!

డాక్ట:- అయితే మందిస్తాను. అక్కడకే తీసుకువెళ్ళు.

దుర్గ:- నిన్నా, మొన్నా, మీరిచ్చిన మందు వాడానండి. ఆ రోజుకా రోజుకెక్కువైపోతున్నది గాని తగ్గుముఖం పట్టలేదు తండ్రీ! యీ ఆసుపత్రిలో జేర్చుకోండి నాయనా! మాకు ధైర్యంగావుంటుంది. నాభర్తను బ్రతికించి నామంగళసూత్రం నిల్పుతండ్రీ! (అనిమంగళసూత్రంచూపించును)

డాక్ట:- (మంగళసూత్రంజూసిదురాశతో) అయితే నీవుతెగ బ్రతిమిలాడుతున్నావు గనుక నేనొకసంగతి చెప్తా విను. ఇరవైరూపాయలు ఇచ్చావంటే యీఆసుపత్రిలోనే ఒక గది ఖాళీ చేయిస్తాను. అందులోరోగిని ప్రవేశపెడితే రోజూచూచి మందిస్తూంటాను.

దుర్గ:- ఇరవైరూపాయలా ? తండ్రీ! చాలా పేదవాళ్లమండి, ధర్మాసుపత్రి యనివచ్చాము.

డాక్ట:- ఎంత పిచ్చిదానివమ్మా ! పెరుగుతోటకూరలో పెరుగెంత వుంటుదో, ధర్మాసుపత్రిలో ధర్మమంతే వుంటుంది.

దుర్గ:- తండ్రీ ! అంతాలంచాలకింద పోగొట్టుకొని సర్వనాశ నమైనాము. తమకు లంచమివ్వటానికి మాదగ్గరేమీ లేదు నాయనా !

డాక్ట:- లంచంగాదమ్మా యిది, ఫీజు.

దుర్గ:- తండ్రీ ! డాక్టరుగారూ ! ఆస్తంతా పోగొట్టుకొని పుట్టెడు దిగులుతో మావారుమంచమెక్కారు. చివ రకు గంజిలోకి ఉప్పుకొందామంటే, గతిలేనివక్షులమై నాము. నాభర్తను బ్రతికించునాయనా ! మీకునమ స్కారంజేస్తాను.

డాక్ట:- (విసుగుతో) పోవమ్మా, అవతలికి. నాకుపనుంది వెళ్ళాలి. (అని సిరంజి పట్టుకొని వెళ్ళును.)

దుర్గ:- (ఆవేదనతో కూలబడి)ఆ? ఆ? లంచంఇవ్వ వలసిందేనా? పేదవాళ్లనుకనికరించే వాళ్లీప్రపంచకంలోనే లేరా ! అయ్యో. అయ్యో. వీళ్లు మనుష్యులేనా, కాదు. కాదు. పేదలను పీక్కుతినే పిశాచాలు. లంచాల పిశాచాలు. ఆ? యిప్పుడేంచేసేది ?

కీర్తన - భీంపలాస్ - ఆదితాళం

ఏమీ తోచదుగా - నాకు ॥ఏమీ॥
పతిజీవితమే గతినిలుచునా ॥యిపుడేమీ॥
లంచమివ్వనిదే - కొంచెమేనియు
పేదవారలకు - బ్రతుకే లేదా ॥ఏమీ॥

ఆ? లంచమివ్వకపోతే నా భర్తకు మందే యివ్వరా? లంచమివ్వకపోతే నామంగళసూత్రం నిలిచే మార్గమే లేదా?(మంగళసూత్రాన్ని చేత్తోపట్టుకొని చూచుకొంటూ) మంగళసూత్రం... ...మంగళసూత్రం... ...ఆ? నా భర్తకంటే ఇదెక్కువా? (లేస్తూ) దీనిని అమ్మితే... దీనిఅమ్మితే.... దీనినిఅమ్మితే... (అంటూపోవును.)

(తెరపడును.)

## 4వ రంగం.

(మైనాపురంలో వేణువుండే హాస్టల్ గది. చేతిలో ఫౌంటెన్ పెన్, కాగితం పట్టుకొని అటూయిటూ తిరుగుతూ ఆలోచిస్తూంటాడు.)

వేణు;- కమల ఇంత సాహసంజేస్తుందని కలలో గూడా అనుకోలేదు. ఈకట్నాల పిశాచానికి ఇట్లాగే ఎంతమంది కన్యలు బలైపోయినారో? కమలకోసం మాఅమ్మా నాన్నా ఎంతకన్నీరు గారుస్తున్నారోగదా? (కొంచెం ఆగి) ఈసమయంలోనే మళ్ళీడబ్బుపంపించమని వ్రాస్తే యేమనుకుంటాడో నాన్న? వందరూపాయలు పరీక్ష ఫీజులకనీ, వాటికనీ, పీటికనీ. యెగిరిపోయినయ్. (జేబుతడిమి జేబులోనించిఒకఅర్ధరూపాయితీసిచూచుకొంటూ) ఒకఅర్ధరూపాయిమాత్రంమిగిలింది,పరీక్షలు

గూడా వారం రోజులలో నే మొదలు. ఏమీ ఆలోచటం లేదే?

(తెరలో) ఎవరండీ ! వేణుగారు ! ఉత్తరమొచ్చింది.

వేణు:- (తీసుకొచ్చి చదువుకుంటూ ఆశ్చర్యంగా) ఆ ! ఏమిటి ? చాలాజబ్బుగా వుంది నాన్నకు ? దయాల్ పురం ధర్మాసుపత్రికి తీసుకువెళ్ళారు ? బ్రతికే ఆశ గూడా లేదూ ? అరె రె ! వెంటనే ఈ ట్రైలుకే వెళ్ళి పోతా. (పోవును.)

(తెరయెత్తగానే)

(దయాల్ పురం ధర్మాసు పత్రిలో గోపయ్య మంచంమీద పడుకొని వుంటాడు. దగ్గరగా కర్ర, మందుసీసా, వుంటయ్. కొంచెం వెడంగా కుర్చీ వుంటుంది. మంచాన్ని ఆనుకొని దుర్గమ్మ పైటచెంగుతో విసురుతూ కూర్చొని వుంటుంది. దుర్గమ్మ మెళ్ళో మంగళసూత్రానికి బదులు గాపసుపు కొమ్ము అందరికీ కనబడేటట్లు కట్టుకొని వుంటుంది.)

గోపయ్య:- (పడుకొని) అయ్యో. ఉ. ఊ. బాధ. అబ్బ. (దగ్గును)

దుర్గ:- (విసురుతూ) కాసేపు పడుకొని నిద్రపొండి.

గోప:- (హీనస్వరంతో) ఏం నిద్రపోవటమే? అబ్బా, ఈ బాధ కు బ్రతకలేనే!

దుర్గ:- భయంలేదులెండి. యీ మందుతో తగ్గుతుందని చెప్పారు డాక్టరుగారు.

గోప:- మందు ... హు ... మనోవ్యాధికి మందున్నదిటే? ఇప్ .... అబ్బాయికి కబురుచేశావుగా ?

దుర్గ:- ఆ ఉత్తరంరాశానూ, అర్జంటుగా రమ్మని.

(ప్రవేట్లబాపిరాజుప్రవేశం. వయస్సు 60. నెరిసీ నెరవని చెంద్రుకళల బట్టతల. మీసాలుగూడా అదే మాదిరి మిశ్రమంగా వుండి పొడుగ్గావుంటయ్. తెల్లని ధోవతి, లాల్చీ, మెడలో బిళ్ళమడత ఉత్తరీయం, చేతిలో కొంకికర్ర, ఇంకొక చేతిలో దస్తావేజుల ఫైలు కళ్ళకు జోడు, కాళ్ళకు చెప్పులు, వుంటయ్.)

గోప:- (నమస్కారంజేస్తూ నుంచంనుంచిదుర్గమ్మ పట్టుకోగా కర్ర సహాయంతో మెల్లగా దిగి మంచానానుకు కూర్చొని) కుర్చీవేయవే కూర్చుంటారు.

దుర్గ:- (బాపిరాజు రాగానే లేస్తుంది. గోపయ్యను కిందకూర్చో పెట్టి గోపయ్య చెప్పినట్టు కుర్చీవేసి) అయ్యాకుర్చీమీద కూర్చోండి.

బాపి:- (కుర్చీమీదకూర్చొని) ఏమిటయ్యా, గోపయ్యా! చాలాజబ్బుగా ఉన్నట్టున్నావే? ఏంజబ్బేమిటి?

గోప:- (చెప్పబోయిదగ్గును.)

దుర్గ:- జబ్బేముందండి. దిగులు. దానితోనే మంచమెక్కారు. దగ్గు, ఆయాసంగూడా పుట్టినయ్.

బాపి:- ఎందుకమ్మా దిగులు?

దుర్గ:- తమకు తెలీకుండా వుంటుందా? లంచాలకింద తగలె య్యటానికి అప్పుజేస్తే, వాడు నాశనంగాను, ఆపావు కారు వుల్లయ్యగాడు ఎనిమిదివందలు ఎనిమిదివేలగా

ఫోర్జరీచేసి కోర్టులో దావా వేశాడు. పైగా పంటగూడా తెచ్చుకోకుండా ఇంజక్షన్ చేయించాడు. ఇటు శాస్త్రీ గారు రెండువందల అపరాధాన్ని నెత్తిన రుద్ది ఇల్లు జప్తుజేసి ఇంట్లోనుంచి వెళ్లగొట్టారు. కట్నాలు పొయ్యలేక కన్నకూతురును మాకడుపున బెట్టుకున్నాంగదా? ఇక దిగులు గాక మరేముంటుంది?

గోప:- (హీనస్వరంతో) వాడిదుంప తెగ. అవుల్లయ్యగాడు ఎంతపన్నాగం బన్నాడండి?

శాపి:- ఆ! ఆ! ఫోర్జరీ చేశాడుగా దురాత్ముడు? ఈ దెబ్బతో వాడి భరతం పట్టించానన్నమాటే! ముప్ప తిప్పలుబెట్టి వాడు చెరువుల నీళ్ళు తాగించి లోగడ వేసుకున్న లోకుల ఆస్తులతో సహా కక్కించకపోతే నా పేరు పైడిపేట్లబాపిరాజేగాదు, (కుడిమీసం ఎడమ చేతితో మెలిబెడుతూ) చూడు నా తమాషా!

గోప:- అవును, తమరంత సమర్థులనేగా పిలిపించింది.

బాపి:- సరేగాని మనమిప్పుడు అన్నరు పెట్టాలిగదూ? ప్లీడరు ఫీజులకనీ, కోర్టుగుమాస్తాల మామూళ్లకనీ, సాక్షుల బేటాలకనీ. నకళ్ళకనీ. నా బొందకనీ, ఏవేవో ఖర్చులుంటయ్. కనుక పైకమిస్తే నేసివ్వాళే మన ప్లీడరుగారి చేత అన్నరురాయించి దాఖలుచేసి సదరు పుల్లయ్యగాడిని తారుమనిపిస్తాను. ఇదిగో! జడ్జీగారికీ, మన ప్లీడరుగారికీ చీట్లపేకజూదంలో స్నేహం కలిసింది. మన ప్లీడరంటే పడిచస్తారా జడ్జీగారు.

గోప:- ఇప్పుడు పైకమేమిలేదండి. దావాగెలవగానే తమరు బెట్టిన ఖర్చులన్నీ వడ్డీతో సహావప్ప జెబుతాను.

బాపి:- అంటే, ముందు నేను మీతరఫున యెదురు పెట్టి వ్యాజ్యం ఆడాలన్న మాట? నావల్లగాదు. అట్లాచెయ్యాటానికి అసలు లా ఒప్పదు.

గోప;- అయ్యా! బాపిరాజుగారూ! కాస్త తమరు సహాయం జెయ్యకపోతే యెట్లాగండి? చిల్లితప్పాలతో కూడా అమ్మి చేబదుళ్లు తీర్చాం. ఒక్కకానీకూడా మిగల లేదు. సహాయిల్లు నిలబెట్టిన. వారవుతా మొదటి నుంచీ తమదగ్గరకే వచ్చి తృణమో, కణమో, తమ శేముట్టజెప్పి తమచేతనే నావ్యవహారాలన్నీ చేయించు కుండేవాణ్ణిగదా? అయ్యా, బాపిరాజుగారూ! యీ ఆపదలో కాస్త ఆదుకోండయ్యా!

బాపి:- అహా, అహా. నావల్లగాదు.

(తెరలో) ఎవరండీ! యిక్కడగోపయ్యగారున్నారా?

దుర్గ:- ఆ. ఎందుకండీ! (వెళ్ళి చేతులో కాగితముతో కొంత పైకముతో తిరిగివచ్చును.)

గోప:- ఏమిటే అది?

దుర్గ:- ఏముంది! మనయిల్లు వేలంవేశారుట? వేలంపాటలో యిల్లుఅమ్మిన సొమ్ము అయిదువందల రూపాయలకు గాను అపరాధం రెండువందలు, అప్పులు రెండు వందలు, వడ్డీ, వేలం వగైరా ఖర్చుల క్రిందమొత్తం నాలుగు వందల సలభై యేడు రూపాయల అరణాల

ముక్కాని పోను మిగతా యాభై రెండురూపాయల తోమిమ్మదణాలకాని యిచ్చి ఈడబ్బేమో మనకుబహు మతిగా తెచ్చియిచ్చి నట్లు తనకు లంచంగా వేధించి ఒక్క రూపాయి తీసుకువెళ్ళాడు ఆ అమీనా.

గోప;- ఆ ! ఆ ! అయిదువందలేనా ? యెంత అన్యాయం ? పదిహేను వందలైనా చేసేయిల్లే! అయ్యో. అయ్యో. (దగ్గి) ఎవరుకొన్నారో అడిగావా ?

దుర్గ;- అడిగాను. ఆ షావుకారు ఫుల్లయ్య గాడేట.

గోప;- దొంగముండాకొడుకు, వాడిదుంప తెగ.

దుర్గ;- వాడిల్లువల్ల కాడుగాను, మావుసుగు తగిలి వాడెన్నడు చస్తాడోగాని.

బాపి;- ఏమయ్యా! గోపయ్యా? నేవెళతా, మరి యేమంటావ్?

గోప;- అయ్యా ! తమరైనా దయయుంచండి మామీద.

బాపి;- దయతో పనిఅవుంతుందిటయ్యా ! డబ్బుతో కావాలి గాని.

గోప;- (ఆలోచించి) పాతిక రూపాయ లివ్వవే.

బాపి;- పాతిక రూపాయలతో పనేమవుతుందయ్యా ? వ్యాజ్యం గెలవాలంటే మూభైరూపాయలూ కావాల్సిందే,

గోప:- అయ్యా ! బాపిరాజుగారూ ! ఈ పాతిక రూపాయలతో పని నెరవేర్చండయ్యా ! తమకొట్నం తరువాత ముట్టజెపుతా గా ?

బాపి;- యెప్పుడెట్లా మారుతుందో మన కేం తెలుసు చెప్పు.

యీ ఖైరూపాయలు యివ్వకపోతే నావల్లకామిగాదు, నేవెళతా. (లేచును.)

గోప;- (విసుగుతో) సరే, యింకేం, ఆయీ ఖై రూపాయలు ఇవ్వవే ?

దుర్గ;- (ఇస్తుంది.)

గోప;- అయ్యా ! గట్టిగా పనిజేసి కేసుగెలిపించండి,

బాపి;- గెలవాల్సిన పాయింటు మనకే వుంది. తప్పకుండా గెలుస్తాం గూడాను. ఇవ్వాళే అన్నీరు రాయించి దాఖలు చేస్తాను. వెళ్ళొస్తా. (వెళ్లును.)

(తెర పడు ను)

# 5 వ రంగము

(మైనాపురంలో రైల్వేస్టేషన్ బుకింగ్ ఆఫీసు దగ్గర అరవవేషంలో గూడకట్టుతో టికెట్లు బీయవా ముందు బుకింగ్ క్లర్క్ నిల్చునివుంటాడు.)

వేణు;- (త్వరత్వరగావచ్చి) సార్! దయాల్‌పురానికి టికెట్టివ్వండి.

బు-క్లర్క్:- బుకింగుస్టాపండి. టికెట్టుదా యివ్వరూ!

వేణు:- అయ్యోయ్యో! చాలాఅవసరంగా వెళ్ళాలండి. మా నాన్నకు చాలాజబ్బుగా వుందిట.

బు-క్లర్క్:- అట్లనా? అటుతిరిగి లోపలాగండిమీా!

(తెరలో గార్డువిజిల్ వినబడుతుంది.)

వేణు:- (తిరిగివచ్చి)సార్!బండిటైమయింది.త్వరగాయివ్వండి.

బు-క్లర్క్:- ఇవాళదా బుకింగ్ స్టాప్‌చేస్తిరి? మీాకు ఒరు టికెట్టు యిస్తేమాకుదా రొంబకష్టం ఉండునూ, మరి మీాఅప్పకుసాలజబ్బుసేసెను అంటిరి! మీాకుటికెట్టు యిస్తేమాకుదాయేమిస్తురు?

వేణు :- నాదగ్గరేం లేదండి, యివ్వటానికి. టికెట్టుకుఅర్ధ రూపాయిమాత్రమేవుంది.

బు-క్లర్క్:- అది యిల్లెసామి! ఆ అరరూపాయికీ మీాకుదాటికెట్టుయిస్తును?నమకుదాఎక్ట్రా)ఒకరూపాయీాయివ్వండి.

వేణు:- నాదగ్గరేంలేదండియివ్వటానికి, రైలు ఛార్జికి సరిపోయేందుకు అర్ధరూపాయిమాత్రమే వుంది.

బు-క్లర్క్:- సరి. ఇంగె టికెట్టుదా యిల్లె, పోండి.

(తెరలో మరల గార్డు విజిల్ వినబడుతుంది.)

వేణు:- (ఆదుర్దాతో) సార్! సార్! చాలాఅవసరంగావెళ్ళా లండి. మానాన్నచచ్చిపోయే స్థితిలోవున్నాడట.

బు-క్లర్క్:- పో, అయ్యా, పో! మీనాయనదా చచ్చిపోతే నీవుపోయి ఆపుసువా? పో!

వేణు;- అయితే రూపాయిలంచమిస్తేగాని టికెట్టుయివ్వరా?

బు-క్లర్క్;-పోడా, పో!లంచం లంచంఅంటేబుద్దిదాచెప్పిస్తును?

వేణు;- (కోపంతో) ఏమన్నావురా, రాస్కెల్! (గొంతుపట్టు కొని ఆచెంప ఈచెంపకొట్టును.)

బు-క్లర్క్:- (భయంతో) పోలీస్! పోలీస్ ! (అరచును.)

పోలీసు;- (వచ్చివిడిపించి) హేమ్టిఇది?

బు-క్లర్క్;- (కోపంతోవణుకుతూ) ఈరాస్కెల్ ఇక్కడావచ్చి డబ్బుదా ఎత్తుకొని పోతూవుంటేఅడ్డంవస్తినిం వాడూ నాగొంతుపట్టి పిసికి నన్నుదా చంపాలీఅనుకొనె. నీవు వచ్చేప్పడికీవాడి చెయ్యిదానా గొంతుమీద ఉండటం చూస్తివి?

పోలీ;- ఆహా, హుదామంగాతి. ధొంగాతనంకోమంఖూనీ ఖీషెయ్యాటానిక్కి తల్చాడూహన్న మాట.

వేణు:- కాదండి. వాడునన్నులంచం ...

పోలీ:- (మాటమధ్యలో అడ్డంవచ్చి) నోర్ముయ్. ఖూనీ కోర్! నడుముందు జేల్ కీ. (వేణునుపట్టుకొని తీసుకొని పోవును.) (తెర పడును.)

# 6 వరంగం

(ఆస్పత్రి గదిలో)

గోప:— (రోగమెక్కువైతుంది. మంచమీద పడుకొని దగ్గుతూ, ఆయాసపడుతూ, రొప్పుతూ వుంటాడు.)

దుర్గ:— (దిగులుతో కంటనీరుకారుస్తూ, మందుసీసా పుచ్చుకొని) ఏమండీ! అట్లాఉన్నారేమండీ యివ్వాళ? ఆయాసం యెక్కువైనట్లుంది. మందుపుచ్చుకోండి.

గోప:— ఊ, ఉ. అబ్బ యెందుకొచ్చినమందులే నాకు?

దుర్గ:— మరితగ్గవద్దుటండీ జబ్బు?

గోప:— ఆ. తగ్గుతుంది వల్లకాట్లో... నేనెటుతిరిగి బ్రతకనే. (కంటనీరుగార్చును.)

దుర్గ:— (పొరలివచ్చిన యేడుపు ఆపుకొంటూ) అట్లాఅనబోకండి. గుండెనగులుతున్నది,

గోప:— (యేడుస్తూ, దుర్గమ్మ తలనిమురుతూ) అయ్యయ్యో! నీకెంతకష్టంవచ్చిందే? (మంగళసూత్రానికిబదులుగా కట్టిన పసుపుకొమ్మును పట్టుకొని) నామందు కోసం మంగళసూత్రం అమ్మటమే గాకుండా పాలు పెరుగులతో తినేదానివి పచ్చిమంచినీళ్ళతో ప్రాణాలు నిలుపుకుంటున్నావుగదే! అయ్యయ్యో ఎంతగతిపట్టిందే?

దుర్గ:— నాకేం పర్వాలేదు లెండి. మీజబ్బు నయమవుతే నాకన్నీ వున్నట్లే.

గోప:— నయమా, ఏమో. నాకేంనమ్మకంలేదే. ఇష్. అబ్బ. (దగ్గి) అయ్యో, అబ్బాయి రాలేదుగా? —

దుర్గ:— వస్తాడులెండి, యివాళో. రేపో. ఉత్తరంరాసి చాలా రోజులయింది, మరి యింతవరకు యెందుకురాలేదో?

గోప:— వాడికి పరీక్షరోజులుగామాల్ను. నాకు యీపాడు రోగం. అబ్బాయి పరీక్షరోజులలోనేవచ్చిందేమే.

దుర్గ:— ఇదంతా మనకర్మ. ఆపాడులంచాలు యెందుకు తగలేశారో గాని ఆరోజున పథ్యానికి నారింజకాయ కొందామన్నా కానీ కూడా లేకుండాపోయింది. ఈ లంచగొండితనం యెన్నడు నాశనమవుతుందో గాని ఎంత మంది ప్రాణాలుతీసిందో?

గోప:— ఈపాపుకార్లు ఎన్నడుచస్తారోగాని ఎన్ని కొంపలు కూల్చారే వీళ్ళు.

(ప్రైవేట్ల బాపిరాజు ప్రవేశము.)

దుర్గ:— (లేచి) (కుర్చీవేసి) కూర్చోండి.

బాపి:— (కూర్చుంటాడు)

గోప:— (లేవటానికి ప్రయత్నించి లేవలేక దుర్గమ్మ సహాయంతో మెల్లగా మంచంమీదనే కూర్చొని) ఏమయిందండీ, ఎంతవరకువచ్చిందివ్యాజ్యం?

బాపి:— అంతా పూర్తిగావచ్చింది. జడ్జీగారుకూడా మన ఆర్గ్యుమెంటే నమ్మాడు.

దుర్గ:— మనమే గెలుస్తామన్నమాట ?

బాపి:— ఓ, తప్పకుండా, కాని ...... ఒకచిక్కు వచ్చింది.

గోప:— ఏమిటండీ, ఆ చిక్కు ?

బాపి;- మరేమీ లేదు. అపావుకారుపుల్లయ్యగాడు కేసుతన పక్షంగా తీర్పు జెప్పించుకోటానికి మూడు వందలు ఇస్తానంటూ, మూడు రోజులనుంచి జడ్జిగారి భార్యా చుట్టూ తెగ తిరుగుతున్నాట్ట. జడ్జీగారికి మన విషయమంతా మన వి జేయించాను మన ప్లీడరు చేత, అంతా విని జాలి పడి అపావుకారుగాడి ఆశలో పడి మారాం జేస్తున్న భార్యాపోరు వదిలించుకోటానికి ఆమూడు వందలకు అధికంగా మరో రెండువందలు జేర్చి మొత్తం ఐదు వందలు అతిరహస్యంగా ఆమెగారి చేతికి స్తేమనపక్షంగా తీర్పు చెప్తానని మరీ మరీ గట్టిగా హామీయిచ్చాట్ట.

గోప:- అ! ఆ? లంచమా? ఐదువందలా? జడ్జీగారికా? హా లంచాల పిశాచమా! ఎంత అక్రమాలకు తలపడ్డావే? న్యాయస్థానల్లో గూడా దూరి ఎంతమందిని నాశనం జేస్తున్నావే?

దుర్గ:- అయ్యోయ్యో! ఇదెక్కడి అన్యాయమండి. ఈలంచాలు మీ మొక్కడ తెచ్చివ్వగలమండీ. న్యాయంమాపక్షానే వుందని జడ్జీగారు నమ్మారంటిరిగా? అప్రకారం తీర్పు యివ్వగూడదూ?

బాపి:- పిచ్చిదానా! డబ్బుముడ్డిలో న్యాయముంది, తెలిసిందా?

దుర్గ:- అయితే ఈన్యాయస్థానాలుగూడా నట్టిబూటకాలేనా?

బాపి;- అహా, నేతిబీరకాయలో నెయ్యి ఎంతవున్నదో, ఈ న్యాయస్థానాల్లో న్యాయంగూడా అంతేవుంది. కనుక ఏవని కావాలన్నా లంచాలివ్వంది లాభంలేదమ్మా,

గోప:- (అసహ్యంతో) ఛీ ఛీ. ఈలంచాంల లోకంలో బ్రతికి వుండటంకంటే చావటమే మేలు. అయ్యొయ్యో! లంచమివ్వనిది న్యాయమే లేదా? లంచమివ్వనిదియీలోకంలో బ్రతకటానికి వీలే లేదా?

(తెరలో) ఎవరండీ, ఉత్తరంవచ్చింది,

దుర్గ:- (పోయితీసుకొచ్చి చదువుతూ) ఆ? ఆ? అబ్బాయికి యావజ్జీవశిక్షా? డబ్బుకాజేయబోయిబుకింగ్‌క్లర్కును చంపటానికిప్రయత్నించాడు?(కూలబడి) హా, వేణూ! (యేడ్చును.)

గోప:- (విని ఆవేదనతో) ఆ? ఆ?ఏమిటి? అబ్బాయిజైలులో పడ్డాడు? యావజ్జీవశిక్షా? ఖూనీచేయబోయినాడూ? హా, వేణూ! (యేడ్చికొంతసేపటికి) అబద్ధం, అబద్ధం వట్టిది వట్టిది. మావేణు అటువంటివాడు కానేకాడు. అక్కడకూడా లంచాలపిశాచం ఆవేశించిన ఏదుర్మార్గుడోయింతపని జేసివుంటాడు. హాలంచాలపిశాచమా! మాకమల రక్తంతో తృప్తిపడలేదా? మాఅందరి రక్తంతోగాని తృప్తిపడవా? ఎన్నికొంపలు కూల్చి, ఎన్నిసంసారాలు నాశనంజేసి, ఎన్నికాపరాలుతీసి, ఎంతమంది పేదవాళ్లరక్తంత్రాగి ప్రాణాలు దీశావే లంచాలపిశాచమా? (యేడ్చి నిలువుగుడ్లతో వెర్రిచూపులు జూస్తూ) ఆ? ఆ? ఎవరునీవు? లంచాలపిశాచానివా? ఎందుకొచ్చావ్? నాప్రాణంగూడా లంచంకావాలా? ఇవ్వను. ఇకలంచంఇవ్వను.

(తెరలో అటూ యిటూ మాటలు వినబడుతుంటే మతిపోయి బిత్తరి చూపులు అటూ యిటూ చూస్తూ వుంటాడు. దుర్గమ్మ భయంతో భర్తనుపట్టు కుంటుంది. తెరలో అంతకంతకు పెద్దగా అటూ ఇటూ, అరుపులు వినబడు తుంటై. ముందు వికటాట్టహాసం వినబడుతుంది.)

(మొదటివైపు) హా హ్హా హ్హా హ్హా హ్హా హ్హో

(రెండవ వైపు) హా హ్హా హ్హా హ్హా హ్హా హ్హో

(మొదటివైపు) ఇవ్వు లంచం .... (రెండవవైపు) ఇవ్వు తక్షణం

(మొదటివైపు) మామూలు .... (రెండవవైపు) కట్నం

(మొదటివైపు) ఫీజ్ .... (రెండవవైపు) లాంఛనం

[వెంట వెంటనే రెండవైపులా అంతకంతకూ బిగ్గరగా అరుపులు వినబడతయ్]

లచం ... లంచం ... లచం ... లంచం ...

గోప:- హా! (అని అర్రచి గుండెపగిలి చచ్చిపోతాడు.)

దుర్గ:- (గోపయ్య గుండెమీద చెయ్యివేసిచూసి) హా, దేముడా! (అని భర్తమీదపడి యేడుస్తుంది.)

బాపి:- (లేచి ఆశ్చర్యంగా గోపయ్య వంకజూచి గోపయ్య చచ్చినట్లు తెలిసేగుర్తుగా చేతులు త్రిప్పి, పెదిమలు విరిచివెళ్ళిపోతాడు.)

(తెర పడును.)

# 7 వ రంగము
## (తెర యెత్తగానే)

(మైనాపురంలో జైలు దగ్గర ముందు పోలీసు, తరువాత దుర్గమ్మ, తెల్లసైను చీరతో, గాజులు బొట్టులేకుండా విధవ వేషంతో తలవిరియ బోసుకొని పోలీసును బ్రతిమిలాడుతూ వస్తుంది).

దుర్గమ్మ:- (బ్రతిమిలాడుతూ) నా వేణును ఒక్కసారిచూపించు నాయనా!

పోలీస్:- వల్లాఖాద్, ఫోవ్ మా.

దుర్గ:- నాయనా, నాయనా! నీకు దణ్ణంపెడ్తా, ఒక్కగాను ఒక్కకొడుకు. ఎన్నాళ్ళో అయింది చూసి. ఒక్కసారి మా వేణును చూపించునాయనా !

పోలీ:- హేమీ యిస్తావమ్మా, నీకీఫ్షూపిస్తే?

దుర్గ:- నాదగ్గరేమీ లేదు నాయనా! యిచ్చేందుకు! నీకడుపు నపుడతాను. ఒక్కసారి నాకొడుకును చూపించు నాయనా!

పోలీ:- హారెౕ హిష్టికీ ఫుట్టెన ఫిల్లల్ తో దాడీ హాజామత్ హావుతూంటేఉప్పర్ నీకీఖీ ఫుడ్తావ్? ఫో, ఫో వ్ మా!

దుర్గ:- అయ్యో. అయ్యో. తండ్రీ! దణ్ణంపెడతాను. ఎన్నాళ్లో అయింది మా వేణును జూసి. కళ్ళు కాయలుగాచి పోయినయ్. గంపెడాశ కడుపులో పెట్టుకొచ్చాను. కనికరించు తండ్రీ, నీకాళ్ళకు మ్రొక్కుతాను.

పోలి:- ఖనికరం హానేదీ మాపోలీస్ జాత్కి ఖలికాస్కి హైనాలేదు. ఫోవ్ మా, ఫో! హావతల్కి ఫో! నాకీపనీ వుందీ. జల్దీఫోవాలి. (పోవును.)

దుర్గ:- ఆవేదనతో (కూలబడి) అయ్యో, అయ్యో, వేణూ! నిన్ని జన్మలో చూడనుటరానాయానా! నాకళ్ళు బొత్తిలు పడిపోను, నిన్నుచూడటానికైనా నోచుకోలేదర్రా వేణూ! ఆజైలులో అమ్మా నాన్నను తలచుకొనిఎంత ఆవేదన పడుతున్నావో గదరా కొడుకా!

గీ. అమ్మ, నాయనయంచు నీవహరహమ్ము
ఒంటి నేరీతి దురపిల్లు చుంటివో గద
ఎన్నిదినముల కేనియు నిన్ను గాంచి
హర్షమును బొందగలననే నయ్యొకొడుక !

ఓలంచాల పిశాచమా ! నీ కెంత దయ లేదే. కూతురును, భర్తను చంపటమే గాకుండా కన్న కొడుకును గూడా జైలులో నెట్టి కనబడకుండా చేశావుగదే. వేణూ ! నిన్ను చూడటానికి గూడా యీ లంచగొండి పిశాచం-ఎంత అడ్డమయి పోయిందిరా కొడుకా !

కీర్తన-భాగేశ్వరి-రూపక తాళం
(శ్రీకృష్ణతులాభారం డ్రామాలో సత్యభామపాడే 'మునివరా' కీర్తన మాదిరి)

పల్లవి:- కొడుకా! కనులార నినుగాంచ నైతిగా ॥కొడుకా॥

1. కన్నసుతుని - నిన్నుచూడ - గంపెడాశతోడరాగ
అకట యీలంచపిశాచి - అడ్డమాయెనయ్యొ నాకు ॥కొడుకా॥

2. కలిమినోర్చి - కమలగూల్చి - కటకట నాపతినిజంపి
జాలిలేని యీపిశాచి-జైలులోన నిన్ను ద్రోసె॥కొడు॥

3\. ఏమిసేతు – ఎటుబోదును. ఏమార్గంబగు పడదే
నీవియోగ మెటులస్సైతు–నిన్ను జూడ కెటులనోర్తు॥కొడు॥

వేణూ! యావజ్జీవమూ నీవాజైలులో అతికష్టాలు పడుతుంటే నిన్ను జూడకుండా బ్రతుకగలనుటరా కొడుకా! బ్రతుకలేను, బ్రతుకలేను. ఆ? నేనిప్పుడెక్కడికి పోయేది? లంచాలపిశాచం ఆవేశించినయీపాడులోకంలో పేదవాళ్లను పలుకరించే దిక్కున్నదా? లేదు. లేదు. ఆ? నాకు పోవటానికి దారేలేదా? (ఎదురుగా ఒక బావినిజూచి ఆవేదనతో లేస్తూ లేకేం? అదిగో దారి చక్కనిదారి. తిరిగిరాని దారి కష్టాలులేని దారి. (బావిదగ్గరకు నడచి) ఈ బావిలో పడితే ఈ గ్రుక్కెడు ప్రాణంఎంత సేపు? (బావిమీదనుంచొని) హా లంచాలపిశాచమా! ఎన్నిప్రాణాలు బలిదీసుకున్నావే? ఈ నాప్రాణం ఆఖరులంచంగా తీసుకొని ఈ లోకంలో లేకుండాపో! ఓ ప్రజలారా! ఇప్పటికైనా మమ్మల్ని జూచి బుద్ధితెచ్చుకొని లంచాలివ్వటం మానెయ్యండి. ఓలంచగొండి ఉద్యోగులారా! మీ దురాశ ఇప్పటికైనా చావదా? ఓ కొంపలు గూల్చే షావుకారులారా! ఎన్నికొంపలుపైనవేసుకొని బాగుపడదామనుకున్నారు? (ఆవేశంతో) ఇదుగో, వస్తున్నా. చచ్చిదయ్యాన్నై పట్టి మీవంశాలను నాశనంజేస్తా. హా లంచాల పిశాచమా! (బావిలో పడును.)

(తెర పడును.)

# 8 వ రంగం

(లంచాల పిశాచనిర్మూలనోద్యమ వాలంటీర్లు అయిదుగురు మరల నినాదాలు చేసుకొంటూవస్తారు.)

(మొదటి వాలంటీరు అనేది) (మిగిలిన నలుగురు అనేది)

నినాదాలు.;- 1. లంచాలపిశాచాన్ని — నిర్మూలించాలి

2. తక్కసాలివ్వటం — తగ్గించాలి.

3. మామూళ్లివ్వటం — మానెయ్యాలి

4. కట్నాలుతీసుకోటం — కట్టిపెట్టాలి

(నినాదాలు చేసినతర్వాత మొదటివాలంటీరు ప్రజల వంక చూసి ఉపన్యాసధోరణిలో)

మొ॥ వా:- ఓ ప్రజలారా ! ఈ లంచగొండితనాన్ని నిర్మూలించటానికి నడుముకట్టండి. ఈ లంచగొండుల దౌర్జన్యాన్ని ఇక సహించబోకండి. ఈ లంచగొండులనుపట్టుకొని బట్టబయలుచేయండి. లంచాలిచ్చేవాళ్ల అవినీతిని నాశనంచేయండి. ఎందరు ఖూనీకోరులు, ఎందరు బ్లాక్ మార్కెటీర్లు, ఎందరు పెత్తందారులు, తాముచేసే దుర్మార్గాలకు శిక్ష పడకుండా తప్పించుకొని పెద్దమనుష్యులమంటూ పేరుబెట్టుకుతిరగటానికి లంచమేగదా ముఖ్యకారణం. లంచంచేయలేనిపనుందా ? ఈ లంచగొండుల దాహాగ్నికి ఎన్నిసంసారాలు దగ్ధమై పోయినయ్? ఎన్నికొంపలుగూలినయ్? ఎన్ని రాజ్యాలడుగంటినయ్? ఆత్మహత్యలతో, అగ్నిప్రవేశాలతో, హాహాకారాలతో, బొబ్బిలిరాజ్యాన్ని భస్మీపటలం చేసినది బుస్సీకిచ్చిన లంచమేగాదా ? ఓ ప్రజలారా ! ఇప్పటి

కైనా కళ్ళు తెరచి మీమీఅవసరాలు తీర్చుకోటా
నికి లంచాలివ్వటం మానివేసి అందరూకలిసిఐకమత్యం
గా వుండి అధికారుల అవినీతికి లొంగక తీవ్రంగా
ప్రతిఘటించి భారతదేశాన్ని చిరకాలంనుంచీపీల్చిపిప్పి
జేస్తున్న యీలంచాల పిశాచాన్ని నిర్మూలించండి!
లెండి! లెండి!

మార్చింగ్ సాంగ్ – మోహన – ఆదితాళం.

(సమిష్టిగానము)

1. లే లెండోయ్ – రారండోయ్ – లేలెండోయ్
లేలెండోయ్–రారండోయ్–లంచపిశాచిని గూల్చండోయ్

2. ప్రబలినట్టియీ – దురాచారమును – పటాపంచలుగ
చేయండోయ్
ప్రజలను పీల్చే – ప్రజాద్రోహులను – ప్రతిఘటించిమరి
నిలవండోయ్ ॥ లే లెం ॥

3. ప్రజల సౌఖ్యముతో – పనిలేనీయీ – లంచగొండ్లతోల
గించండోయ్
అందరు కలిసీ – ముందుకుసాగీ – ఐకమత్యముతో –
పోరండోయ్ ॥ లే లెం ॥

(అందరూ రత్నపాడుతూ వెళ్లిపోతారు.)

(తెర పడు ను)

ద్వితీయాంకం సర్వం సంపూర్ణం.

---

శ్రీ సారథి ఆర్టు ప్రెస్, మరాబ్ బజారు తెనాలి.

